రెంటాల గోపాలకృష్ణ

# శిక్ష

[ పదితర నాటికలు ]



సాహితీ ప్రవంతి ప్రచురణ

ప్రతులకు :

సాహితీ ప్రవంతి
లేక
జనతా బుక్ హౌస్,
విజయవాడ-2

ముఖచిత్రం రచన: శ్రీ పి. వి. సుబ్బారావు

వెల: ఒకరూపాయి



తొలిముద్రణ
వెయ్యి ప్రతులు
జూన్ 1952

స్వతంత్ర ఆర్ట్ ప్రింటర్సు, విజయవాడ-2



# అంకితం

ప్రజా ఉద్యమంలో ప్రభుత్వ దమననీతికి
ప్రాణాలర్పించిన తెలంగాణా సోదరులకు



"జీవితాన్ని జాగ్రత్తగా చూడండి;

నాటకం ఉద్దేశం కేవలం ప్రదర్శనమాత్రమే కాదు;

నాటకం జీవితంతోపాటు నడవాలి''

వాంకంగోవ్; మాస్కో

# నాటక కళ

కళ ప్రజలసొత్తు. కళ ప్రజల ఆయుధం. కళను ఆరాధ్య దేవతగా భావించి కళకోసం బ్రతికి, కళకోసం ప్రాణాలర్పించిన కళాప్రపూర్ణులెంతోమంది వున్నారు.

"చీరెకు అంచు ఎలా అందమిస్తుందో జీవితానందానికి కళ కూడా అంతే" (కాకా కలేల్కర్)

కవనం, శాస్త్రం, సంగీతం, నృత్యం, నాటకం, అభినయం, అలంకారం, ఇవన్నీ కళాక్షేత్రంలో భాగాలు. మనం మన జీవితాన్ని కళారూపంలో చూస్తూ ఆనందాన్ని అనుభవిస్తాం. ఇదే కళయొక్క ముఖ్య ప్రయోజనం. ఈనాడు కలుగుతున్న మరొక ప్రయోజనం ఏమిటంటే కళ ప్రచార సాధనంగా ఉపయోగపడటం. ఒక ఉపన్యాసకుడు అనేక గంటల తరబడి వాగ్ధోరణిలో అవసరమైన విషయాన్ని ప్రజలకు అర్థం అయ్యేటట్లు చేయటానికి శ్రమపడతాడు. అదే విషయాన్ని స్వల్ప కాలం వినియోగించి కళా రూపంలో ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులు విషయాన్ని సులభంగా అర్థం చేసుకోవడమే కాకుండా, ఆనందాన్ని పొంది హృదయ పరివర్తన చెందగలుగుతారు. అందుకే ఈనాడు కళ, ప్రచారానికి ముఖ్యసాధనంగా ఉపయోగపడుతూఉంది.

ఆధునిక యుగంలో కళయొక్క అవసరాన్ని అందరూ గుర్తించారు. ఇతర దేశాలతోపాటు మన దేశంలోగూడ కళా రంగంలో విప్లవం వచ్చింది. పౌరాణిక నాటకాల పాతవాసనలు రచయితలకు, ప్రేక్షకులకుగూడ వెగటు కలిగించాయి. ఆకాలంలో శృంగారం కథావస్తువు. ప్రణయ దంపతులు నాయకీ నాయకులు. ప్రేమఘట్టాలలో ప్రేక్షకులను లీనమయ్యేట్లు చేయగలిగితే రచయిత కృతార్థుడౌతాడు. కాని ఇప్పుడా శృంగారంలేదు. 'నా ప్రేమ తరంగిణీ' అని పిలిచే నాయకుడు లేడు. అయితే ఆనాడు ఉత్తమమైన నాటకాలు లేవనికాదు. ఉత్తమమైన రచయితలు లేరనీకాదు. షేక్స్పియరు, కాళిదాసు ఈ నాటికీ ఆరాధ్యమూర్తులే. రచనా విధానంలో వారిని మనం అనుసరించాలేకాని, ఆనాడు వారు తీసుకున్న రచనా వస్తువు ఈనాడు మనకు అనుకరణీయంకాదు. అందుకు ముఖ్యకారణం ఈనాటి పరిస్థితులు, ఈనాటి మానవ జీవితం. ఈనాటి బ్రతుకుల్లో చీకటి ఆవరించింది. ఈనాటి జీవితంలో నిరాశ, నిస్పృహా, బాధ, భయం, విషాదం, ఇవన్నీ పెనవేసుకొని ఉన్నాయి. బ్రతకాలని ఆశఉంది. కాని బ్రతకడమంటే భయం. భయం!!! భయం!!! తెల్లవారితే భయం! ప్రొద్దుకుంకితే భయం! పెండ్లి అంటే భయం! బిడ్డపుటితే భయం! ఇవి ఆకలిరోజులు, అందుకే ఈనాటి జీవితంలో శృంగారానికి తావులేదు. అడుగడుగునా అడ్డంకులే. అన్నీ సమస్యలే – ఈ యథార్థాన్ని చిత్రించడమే ఈనాటి రచయితల పరమావధి. ఈ సత్యాన్ని నిరూపిస్తూ అభ్యుదయ సాహిత్యంలో కావ్యాలు, కథలు, నాటకాలు, నాటికలు, బుర్రకథలు, నృత్యాలు అనేకం వెలువడినవి. 'కన్యాశుల్కం' నాటక సాహిత్యంలో కొత్త రూపాన్ని ప్రసా

దించింది. మాభూమి, ముందడుగు, నాటకాలు మన హృదయాల్ని ఉత్తేజపరిచినవి. ఇటీవల వచ్చిన అనిసెట్టి గాలిమేడలు, మా ఊరు, శాంతి మొదలయినవి, ఆత్రేయగారి నాటకాలు, రంగస్థలంమీద కొత్త వెలుగుల్ని విరజిమ్మి జీవితానుభూతుల్ని తీర్చిదిద్దినవి. అయినా ఇంకా మనకు చాలినన్ని ఉత్తమ నాటకాలు లేవు. కావలసినంతమంది ఉత్తమ నాటకరచయితలూ లేరు. గోర్కీ, డాస్టవస్కీ, గొగోల్, టాల్‌స్టాయి లాంటి ఉత్తమ రచయితలు మన కెంతో మంది కావాలి.

మనం యింకా గమ్యాన్ని చేరలేదు. మనకు కావలసినన్ని థియేటర్లు లేవు. అమెచ్యూర్ నాటక సమాజాలు ఏర్పడ్డా, వాళ్ళకు తగినంత ప్రోత్సాహం లేదు. స్టేజి నటులను ప్రజలుగాని, ప్రభుత్వంగాని ప్రోత్సహించి ముందుకు నడపటంలేదు. ఈ నాడు సినిమానటులకు గల ఆదరాభిమానాలు వీళ్లకు లేవు. కాని ఈనాడు సినిమాలో ఎంతో యింతో పేరుపొందిన ప్రతి నటుడూ ఒకప్పుడు రంగస్థలంమీద అనుభవాన్ని సంపాదించినవాడేనని అందరు గుర్తుంచుకోవాలి. ముఖ్యంగా ప్రభుత్వమూ, ప్రజలుకూడ నాటకరంగాన్ని అభివృద్ధిపరచడానికి పూనుకోవాలి. మన దేశంలోని ధనికులు గుళ్లు, గోపురాలు కట్టించి సంతర్పణలు, సప్తాహాలు చేయటానికి ముందుకు వచ్చినంతగా ఇలాంటి కళాఉద్యమాలకు కాసంతైనా తోడ్పడరు. ఇక ముందైనా అలాంటివి జరుగుతాయని ఆశిద్దాం.

నాటక రచయిత రచనాశిల్పాన్ని సమృద్ధిగా కలిగివుండ డానికితోడు రంగస్థలంమీద నటకుడుగాకూడ అనుభవం పొంది ఉంటే నాటకాన్ని అత్యుత్తమంగా వ్రాయగలడనటం

సందేహం లేదు. నాకు గల ఆ అనుభవంతోనే ప్రయత్నించి, శ్రమించి ఈ నాటికలు వ్రాశాను. నా ప్రయత్నంలో ఎంతవరకు సఫలీకృతుడనయ్యానో పాఠితలూ, ప్రజలూ నిర్ణయించాల్సి ఉంటుంది.

మరొకమాట. ఈ నాటిక ప్రదర్శించదలచుకొన్న నాటక సమాజాలవారిని నాకు ముందుగా తెలియపర్చమని కోరుతున్నాను. ఇలా అడగడంలో ధనాపేక్ష కాదని మనవి చేస్తున్నాను. ప్రదర్శనాలు జయప్రదం కావాలంటే నటీ నటులు (Team Work) తో కృషిచేయాలి. నాటికల్లోని ఇతివృత్తాల్ని మనస్సుకు పట్టించుకొని, ఆ యా పాత్రల్ని చక్కగా అర్థం చేసుకొని వీలైనన్ని ఎక్కువసార్లు 'రిహార్సల్సు' జరపాలి. అప్పుడే ప్రదర్శనాలు ప్రజల హృదయాల్లోకి చొచ్చుకొనిపోయి రక్తి కట్టగలుగుతాయి. దీన్ని ఆమోదించి ఆచరించే ప్రతివారికీ ఈ నాటికల్ని ప్రదర్శించే హక్కు ఉంది.

—రచయిత.

Note : ఈనాటిక మూకాభినయం (Pantomime)తో కూడినది. వెనుకనుండి Commentary చదువుతూ ఉంటే దానికి అనుగుణ్యంగా రంగస్థలంమీద పాత్రలు అభినయిస్తూ ఉండాలి.

Commentary చదివేవారు గంభీరమైన కంఠస్వరం కలిగి ఉండాలి. చదివేటప్పుడు ప్రతిమాట తాపీగానూ, భావ యుక్తంగానూ స్పష్టంగానూ చదవాలి. నటకులు Commentaryని జాగ్రత్తగా follow అవుతూ ఆ ప్రకారం చక్కగా నటించాలి. పాటలూ, మ్యూజిక్ వచ్చినప్పుడు ఆయా tunes అనుగుణ్యంగాను, ఆ యా పాటల సందర్భానికి తగినట్లుగాను, నృత్యంచేయాలి.

నాటిక ఆదిలో మానవ సృష్టినిగురించి చెప్పినప్పుడున్నూ, అంత్యంలో భూతాలకు స్వప్నం వచ్చినట్లు చూపవలసినప్పుడున్నూ Spot Lights సహాయంతో Shadow play చూపించాలి. ఇంకా ఆయాసందర్భాల్లో Lighting effects, Sound effects, Music సరిగా ఇచ్చినప్పుడే ఈనాటిక పూర్ణంగా రక్తి కట్టకలుగుతుంది.

# ఆ టం

కాలం : ప్రస్తుతం

ప్రదేశం : ఈ విశాల ప్రపంచంలో ఎక్కడైనాసరే

పాత్రలు :

యుద్ధ భూతాలు 1, 2

మానవుడు

కార్మికుడు

కర్షకుడు

సైంటిస్టు

ఆటం (మృత్యురూపం)

ప్రకృతి (స్త్రీ మూర్తి)

ఇంకా అనేక మంది ప్రజలు

రంగస్థల వివరణ : (Stage Notes) రంగస్థలంమీద పల్చని రంగుతెర వేసి ఉంటుంది. తెర వెనకాల అంతా నీలిరంగు కనపడుతూ ఉంటుంది. (Spot Lights) మధ్యలో శూన్యంగా ఉన్న Globe. Globe లోంచి అగ్నిజ్వాలలు, పొగలు, పైకి వ్యాపిస్తూ ఉంటాయి.

వ్యాఖ్యాత: (Commentator) సృష్టి. ప్రపంచంయొక్క పుట్టుక, ప్రాణులయొక్క మొదటి చరిత్ర, వినడానికి విచిత్రంగా ఉంటుంది. చూడ్డానికి భయంకరంగా ఉంటుంది. అయినా నేటి మానవుడు తన మేధస్సుతో, తన విజ్ఞానంతో పరిశీలించి, పరిశోధించి, అనాది మానవుడి చరిత్రను, తెలియని

ఈ సత్యాన్ని లోకంలో చాటించాడు. అదిగో! ఆ కనపడేది భూమి. భూమియొక్క మొట్టమొదటి స్థితి. అత్యంత వేడిగా అగ్నిగోళంగా నిప్పులు కక్కుతూ ఉంది. ప్రాణులు నివసించడానికి వీలుగాని ఆ అగ్నిగోళం అలాగే అనేక సంవత్సరాలు ఉండిపోయింది. క్రమక్రమంగా భూమినుండి వ్యాపించిన వేడి ఆవిరిగాను, ఆ తరువాత నీరుగాను మారింది. ఇలా ఏర్పడిన సముద్రాలు, కురిసిన వర్షాలవల్ల రానురాను వేడి తగ్గిపోయి ధరణి యావత్తూ చల్లగా అయింది. అందువల్ల భూమిపై ప్రాణికోట్లు నివసించడానికి వీలుకలిగింది.

రంగస్థల వివరణ : (Stage Notes) Globe లోంచి పొగలు రావడం ఆగిపోతుంది. చుట్టూ నీలిరంగు అధికమౌతుంది. భూమికి అన్నివైపులా నీరు తొణికిసలాడుతున్నట్లు కనపడుతుంది.

వ్యాఖ్యాత : (Commentator) భూమి బ్రహ్మాండమైన అణుగోళము. ఇందులో అగణితమైన అణువులు, పరమాణువులు, సమ్మిళితమై యున్నవి. మొట్టమొదటిసారిగా భూమిపైన అణువులు, పరమాణువులు, కదల నారంభించినవి. ఈ అణు పరమాణు సమ్మేళనంతో ఏర్పడిన చైతన్యశక్తి, అదే ప్రాణిశక్తియై భూమిపైన సృష్టికి కారణాన్ని కల్పించింది. భూభ్రమణంలో ఈ సమ్మేళనం అసంఖ్యాకంగా జరుగుటచే కోట్లకొలది చేతన రూపాలు బయల్పడినవి. ప్రాణశక్తి మొదట్లో చిన్న చిన్న స్వరూపాల్లో ఏర్పడి, కాలక్రమేణ పరిణామాన్ని పొందింది. నీటిలోను అటుపైన భూమిపైనను చిన్న చిన్న జంతువులు, ఆ తరువాత భూమిపైననే జీవించగల మృగాలుగాను ఏర్పడ్డాయి. వివిధ రూపాల్ని

పొందిన జంతు సంతతులు జీవించడానికి అనువుగా భూమి మీద పలురకాల వృక్షసంతతి, పుష్పాలు, లతలు, అందమైన అడవులు విలసిల్లినాయి. అటుపిమ్మట ధరిత్రియొక్క శాంతి గర్భంనుండి మహోత్కృష్టమైన "మానవుడు" జన్మించాడు.

రంగస్థల వివరణ: (Stage Notes) Globe మీద అనేక రకాల చెట్లు, పుష్ప లతలు, కనపడతాయి. అంతటా ప్రకృతియొక్క సౌందర్యం దృగ్గోచర మౌతుంది. ఆ శోభ దశదిశలా వ్యాప్తిచెందుతుంది. తెర తొలిగిపోతుంది. ప్రకృతి తరుణి రూపంలో ప్రవేశిస్తుంది.

వ్యాఖ్యాత: (Commentator) ఏమిటాశోభ? ఏమిటా వెలుగు? ప్రకృతి. సృష్టికి ఆదిమాత. ఎంత సుందరంగా ఉంది? ఆ వదనంలో ఎంత ప్రశాంతత ఉంది. జ్యోతుల్లాగా మెరిసే ఆ కళ్ళల్లో ఎంత కారుణ్యం ఉంది. ఆ మనస్సులోని స్థిరత్వం, ఆ హృదయంలోని నిర్మలత్వం, ఆ నడకలోని గాంభీర్యం, ఆ చూపుల్లోని తేజస్సు, ఎలా వెలిగిపోతున్నాయో చూడండి! (ప్రకృతి సుందరమైన నృత్యం చేస్తుంది) కోటి సూర్యగోళాల కాంతిని ధిక్కరిస్తున్న ఆమె వెలుగు సర్వప్రాణుల్ని శాంతి సౌభాగ్యాల్లో ముంచెత్తుతుంది. ఆమె సుందర సురుచిర శోభాలంకృతిలో, ఆ చల్లని హాస్యాల్లో, విశాల విశ్వాలయం ముంగిట ఉదయభాను నర్తిస్తూ, అనంత సాగర గంభీర కెరటాల ఘోషలో, నినదిస్తూ, చరిస్తూ, ప్రతిప్రాణి, ప్రతిజీవి, బ్రహ్మానందంలో, పరమానందంలో మునిగి తేలుతుంది. ఈ సృష్టి అంతా ఆమెబిడ్డలు. ఆమె కెవ్వరిపైనా ద్వేషం లేదు. అందరినీ సమానంగా ప్రేమించి

ఆవరిస్తుంది. (ప్రకృతి అదృశ్యమౌతుంది. మరొక వైపునుండి జీర్ణ వస్త్రాలతో మానవుడు ప్రవేశిస్తాడు.)

వ్యాఖ్యాత : (Commentator) ఆ వచ్చే అతన్ని చూడండి! అతడొక మానవుడు. సామాన్యమానవుడు. సృష్టిలోకల్లా ఉత్తమోత్తమమైన ప్రాణి. తెలివిలేని జంతువుల తరువాత, ఉద్భవించిన మహామేధావి. అత్యంత బలశాలి. అమోఘమైన ఆత్మశక్తి, అద్భుతమైన తేజస్సూ, ఆతనిలో ఉన్నాయి. అతని కసాధ్యమైంది ఈ జగత్తులో ఏమీలేదు. తాను జీవించడానికి మానవజాతి విస్తరించడానికి, వివిధ మార్గాల్ని కనిపెట్టాడు. ప్రకృతిని ఎదుర్కొని సమస్తాన్ని స్వాధీనం చేసుకున్నాడు. తన ఆత్మశక్తి చేతనే అన్ని ప్రాణుల్లోనూ ఉత్కృష్ట స్థానాన్ని ఆక్రమించుకున్నాడు. సృష్టి సాగుతూ ఉండడానికీ, చరిత్రను నడిపించడానికీ, పలు రకాల పరికరాల్ని పోగుచేసాడు. శాస్త్రాన్ని, విజ్ఞానాన్ని, పరిశోధించాడు. అందమైన పట్టణాల్ని నిర్మించి, నాగరికతను పెంపొందించాడు. అత్యుత్తమమైన ఆహారాన్ని సంపాదించుకున్నాడు. శిల్పాన్ని, కళల్ని ఉద్ధరించాడు. సంఘాన్ని సమస్తంలో విస్తరింపజేసి చివరకు యంత్రాన్నిగూడా సృష్టించాడు. ఆనందంతో జీవించిన ఆదిమానవుడు రానురాను ఆవేదనతో క్రుంగిపోసాగాడు. సమానంగా బ్రతుకుతున్న సంఘంలో సంఘర్షణ ప్రారంభమైంది. ప్రపంచ సుఖాల్ని బలవంతులూ, స్వార్థపరులూ, అయిన కొందరు ఎక్కువభాగం దోచుకున్నారు. వసుంధరాదేవి, కొందరు కబంధుల కోరల్లో చిక్కి, రాబందుల రెక్కల్లో ముక్కి విచ్ఛిత్తి పొందుతూ ఉంది.

మనుషులని పిలువబడే రాక్షసులకు రక్తదాహం కలిగింది. నియంతలు, స్వార్థపరులు, ఎటుచూచినా వారే. పరిపాలన పేరిట తమ భుజాస్ఫాలనాదరోద్ధృతంతో ఈ హంతకులు ప్రజల్ని పీడించి దోచుకున్నారు. కాలంపొడుగునా యుద్ధాలతో, అడుగడుగునా రక్తపాతంతో చరిత్ర నడుస్తూవచ్చింది. వర్గాలుగా ఏర్పడ్డ సమాజాన్ని "మానవుడు" పునరుద్ధరించ డానికి పూనుకున్నాడు. సంఘ వ్యవస్థను మార్చి సమతలో భూతలాన్ని. నిర్మించి, మానవ జీవితాన్ని స్వర్గధామం చేద్దామని సమకట్టాడు. అందుకై జరుగుతూవున్న మహా సమరంలో అతనికి అమృత నిర్ఝరిణి అగుపడుతూవుంది. వెంటనే రక్తవాహిని, వైతరణీ సమీపిస్తున్నాయి. ఒకవైపు ఆశ, మరొకవైపు నిరాశ, ఒకప్రక్క ఆశయం, వేరొక దిక్కు ఆవేశం, ఇటు సత్యం, అటు అసత్యం, ఇటు నీతి, అటు అవినీతి, ముందు జీవితం, వెనుక మరణం, ఈ సాంధ్య రాగాల్లో, ఈ వ్యతిరేక శక్తుల మధ్య ఈ విరుద్ధ విన్యాసాల్లో, నలుగుతూ మానవుడు నవలోకానికి నాంది పాడుతున్నాడు.

నేనూ ఒక మానవుణ్ణి!
మరణించని మానవుణ్ణి!

భూతకాల వాహినిలో
వర్తమాన జగత్తులో
ఆగామిక లోకంలో
జీవించే శాశ్వతుణ్ణి!

నేనూ ఒక మానవుణ్ణి!
మరణించని మానవుణ్ణి!

నరలోకం సుఖపడుటకు
నరజాతి విముక్తికోరకు
నడుస్తున్నా యుగయుగాలు!
నడుపుతున్నా జగజగాలు!

నేనూ ఒక మానవుణ్ణి!
మరణించని మానవుణ్ణి!

యుద్ధభూత పాదస్థలి
హతమయ్యే ప్రాణికోట్ల
ఆకలితో అప్పులతో
అల్లాడే జీవతతుల
సౌభాగ్యపు పాలనకై,
అనుక్షణం శాంతిసమర
రథచక్రం నడుపుతున్న
సైనికుణ్ణి! మానవుణ్ణి!

నేనూ ఒక మానవుణ్ణి!
మరణించని మానవుణ్ణి!

(నేపథ్యంలోని సంగీతాన్ని అనుసరిస్తూ మానవుడు సుందరంగా నృత్యంచేస్తాడు)

(ఒకవైపునుండి ప్రకృతి ప్రవేశిస్తుంది).

ప్రకృతి కంఠం: (Nature's Voice) ఎవరయ్యా నీవు! ఎందుకిక్కడున్నావు ?

మానవ కంఠం: (Man's Voice) నేనా! హా! హా! హా!

నన్నెరుగవూ నీవు? ఈ సృష్టి జరిగిన నాటినుండీ నేను ఉంటూనే ఉన్నాను. అన్నిచోట్లా అన్నిమూలలా నేనే. ఈ విశ్వమంతటా నే నున్నాను. నాలో ఈ విశ్వమంతా ఉంది.

ప్రకృతి కంఠం: నీకు పేరూ, ఊరూ, ఏమీ లేదా?

మానవ కంఠం: చెప్పానుగా! ప్రపంచంలో అన్నిచోట్లా నేనుంటానని. ఇక నేను చేయని పనంటూ లేదు అగ్నిజ్వాలల మధ్య ఇనుప కమ్మీలపై సమ్మెటపోట్లువేసే కార్మికుణ్ణీ, ప్రతేతాగ్నిలో కాల్చే సూర్యునియెదుట పంటభూముల్లో కొడవలిపట్టి కోసే కర్షకుణ్ణీ, అన్నివేళలా భరించలేని బండల్ని మోస్తూ ఉండే కూలినీ నేనే. ఆఫీసుల్లో గుమాస్తాను. విద్యాలయాల్లో ప్రొఫెసర్ను, గనుల్లో, కార్ఖానాల్లో, పడవల్లో, నావల్లో, కంటికి కనపడే ప్రతి పనివాడిలో నేనున్నాను. ఇక నేను కానిదల్లా పనిలేని సోమరిపోతులు, మేడల్లో భోగాలు అనుభవిస్తూ క్రింద చూడకుండా ఉండే ధనమదాంధులు, న్యాయాన్ని గుర్తించక క్రూరంగా హింసించే, దండించే అధికారులు. నాకు తెలిసిందల్లా నేను మానవుణ్ణని. గుడిసెల్లో, కుటీరాల్లో, పేవ్మెంట్సు, ప్లాటుఫారాలు, కాలిబాటలు, చెట్లు, గట్లు, గోడలనీడలు, ఇవి నేను విశ్రాంతి తీసుకునే స్థలాలు.

ప్రకృతి కంఠం: అయితే బాబూ! నీ వెవ్వడైనా ఏదైనా మహత్తరకార్యం సాధించడానికి పూనుకున్నావా?

మానవకంఠం: అహా! హా! హా! ఎంత వెర్రిదానవమ్మా నీవు! ఇంకా నా విషయం పూర్తిగా తెలుసుకోలేదన్నమాట.

విను చెప్తా! మానవులంతా సమానంగా జీవించాలని నా కోరిక. ఈ లోకంలోని సుఖం అందరూ సమానంగా పంచుకుని అనుభవించాలని నా ఆశయం. ఈ సుందరమైన సృష్టిలోని ఆనందం పొందడానికి మానవులందరూ వారసులే. అయితే ఏంచేస్తాం? ఆ ఆనందాన్ని బలవంతులూ, స్వార్థపరులూ అయిన కొందరు ఎక్కువభాగం దోచుకున్నారు. దానితో సంఘంలో హెచ్చుతగ్గులు ఏర్పడ్డాయి. ఈ అసమ సంఘ వ్యవస్థను మార్చడానికి సంఘర్షణ జరుగుతూవుంది. అనేక శతాబ్దాలనుండి మానవులీ మహాసమరాన్ని నడుపుతున్నారు. యుగయుగాలుగా తపస్సుచేస్తూ సాధనలో మగ్గుతున్నారు.

ప్రకృతి కంఠం: అయితే నాయనా! నీలో ఏదో నిస్పృహా, నిరాశ, విషాదం, కనపడుతూ వున్నాయి. ఇంతకు ఆ మహాత్తర ఆశయం సిద్ధించనే లేదా! మానవులు సుఖపడేమార్గం కనిపించనేలేదా?

మానవ కంఠం: లేదమ్మా లేదు. ఇంకా అలాంటి సుదినం రాలేదు. ఏంచేస్తాం? లోకంలో ఒకవైపున యుద్ధాలు, మరొకవైపు క్షుద్బాధలు. ప్రజలు తిండికీ, బట్టకూ లేక మలమల మాడుతున్నారు. వస్తువుల ధరలు ఆకాశంలో కెగసి అందకుండా పోతున్నాయి. యుద్ధాలతో, ఆటంబాంబులతో పచ్చని పృధ్వీతలం ప్రేతభూమి అయింది. వెచ్చని నెత్తురుతో అభిషేకింపబడింది. కార్మికుల స్వేదంతో నిర్మించిన కట్టడాలు, విశ్వంభరాదేవిని కళకళలాడించే సుందర నగరాలు కూలి ధూళి కలిసినవి. జనం కుప్పలు కుప్పలుగా

నశిస్తున్నారు. నలుమూలలా రోగాలు, ఆకలిచావులు నృత్యం చేస్తున్నాయి. ఆకలి! ఆకలి! అనే అరుపులు ప్రతి చోటా ప్రతి ధ్వనిస్తున్నాయి. ఈ మహోద్యమంలో మాకు కారుచీకట్లేకాని కాంతిరేఖలు కనిపించడంలేదు. (Pause) అయితే అమ్మా! అడగటం మరిచాను. ఇంతకూ ఎవరు నీవు? ఇంత ఆప్యాయంగా నా క్షేమాన్ని విచారిస్తున్న నీవెవ రమ్మా? నీ పలుకుల్లో అమృతం ఒలుకుతూంది. కారుణ్యం తొణికిసలాడుతూ ఉంది. నీ సమక్షంలో మాట్లాడుతూంటే నాలో ఏదో కొత్తరక్తం పెల్లుబుకుతూన్నట్లుంది. చెప్పమ్మా! చెప్పు. ఎవరు నీవు?

ప్రకృతి కంఠం : నేనా? నేను ప్రకృతిని. ఈసృష్టికి ఆదిమాతను. ప్రపంచంలోని ప్రాణికోట్లంతా నా బిడ్డలు. భయంకరమైన అడవులు, సుందరమైన వనాలు, అనంతంగా వ్యాపించి యున్న సముద్రాలు, పరిశుద్ధమైన నదులు, అమూల్యమైన ఖనిజాలు, అపారమైన సస్యసంపదలు ఇవన్నీ నేనే.

మానవ కంఠం : (సంతోషంతో) నీవా! నీవు ప్రకృతివా? నీవు నా తల్లివా? మానవుని పుట్టుకకు మూలమైన మాతృ మూర్తివా నీవు? తల్లీ! నన్ను క్షమించు. అమాయకుణ్ణి. నిన్ను తెలుసుకోలేక, నా బాధలవల్ల, నాలో ఉన్న భయం వల్ల, ఏదేదో చెప్పాను. ఏమేమో మాట్లాడాను.

ప్రకృతి కంఠం : ఫరవాలేదు బాబూ! భయపడకు. నీవే స్థితిలో ఉన్నావో నాకు తెలుసు. మానవులంతా ఎలా బాధలు పడుతున్నారో నేను చూస్తూనే ఉన్నా. నా బిడ్డల్లో ఏర్పడ్డ చీలికల్ని చూచి సహించలేకపోతున్నా. వాళ్ళను

మనుషులని ఉచ్చరించడంకూడా నీచమనిపిస్తాంది. వాళ్ళు నా గుండెలపైననే కుంపటెత్తుతున్నారు. యుద్ధాల పేరిట మిమ్మల్ని మాడ్చి, స్వార్థంకోసం నా రమణీయాకృతిని రక్తవాహినిలో ముంచి తేలుస్తున్నారు. నాలోని సమస్త సంపదలూ తమకోసమే పుట్టినట్లు భావిస్తున్నారు. వాళ్ళల్లో మానవత్వం నశించింది. అసత్యం, దౌష్ట్యం, క్రూరత్వం, జడత్వం, వాళ్ళహృదయాల్లో గడ్డకట్టింది. వాళ్ళ మనస్సుల్లో స్వార్థం జీర్ణించి అధికారం పేరుకుపోయింది. ఈ అసహజత్వం అరికట్టబడి నవలోకంలో మానవులంతా సుఖించే సుదినం కోసం నేనూ ఎదురు చూస్తున్నాను.

మానవ కంఠం : తల్లీ! నీ పలుకుల్లోని ప్రతి అక్షరం సత్యంలోని బీజాక్షరాలు. నీవు నిజమైన మాతృమూర్తివి. సమవర్తివి. అమ్మా! నీ పాదాలు పట్టుకొని వేడుకుంటాను. మేమూ, మాతోపాటు నీవూ ఇలా ఎంతకాలం సహించి ఉంటాం? మానవులకు మంచిరోజే రాదా? మా ఆశయం అంతం కావల్సిందేనా? మా సమరం సమసిపోవల్సిందేనా? మా ప్రచండ సాధనకు ప్రయోజనమే కనిపించదా? చెప్పు తల్లీ! చెప్పు! ఇందుకు సరియైన మార్గాన్ని నీవే చూపించి మమ్మల్ని గమ్యాన్ని చేర్పించు!

ప్రకృతి కంఠం : నిస్పృహ చెందకు బాబూ! మీ ఆశయం తప్పక సిద్ధిస్తుంది. (గంభీరంగా) ఏక దీక్షతో మీ శాంతి సమరాన్ని కొనసాగించండి. నిరాశ, భయం, మృత్యువు, వీటిని దగ్గరికి రానీయకండి! అకుంఠితమగు దీక్షను, అపారమైన ప్రజాబలాన్ని సంపాదించండి! ప్రతిజ్ఞ చేసి పురోగమిం

చండి! హిమాలయాలై కదలండి! బ్రద్దలైన అగ్నిపర్వతంలా విజృంభించండి! ప్రచండ ఝంఝువులా ప్రవహించండి! గమ్యం కనపడుతూనేవుంది. కాలం దగ్గరగా వస్తూంది. నవలోక నిర్మాణం తప్పదు! మానవుడా! నీకు విజయం తథ్యం!

మానవ కంఠం : అమ్మా ధన్యుణ్ణి! నా ఎండిపోయిన నరాల్లో రక్తంపోశావు. కృశించిన నా కండల్లో జీవకణాల్ని నింపావు. మోడువారిన నా దేహాన్ని నీ వసంతఋతు పవనంచేత చిగురింప చేశావు. బండబారిన నా గుండెల్లో చైతన్య జ్యోతిని రగుల్కొల్పావు. ఈ మానవ మహోద్యమాన్ని నిర్విఘ్నంగా కొనసాగిస్తాను. తల్లీ! ధన్యుణ్ణి! (మానవుడు ప్రకృతికి మోకరిస్తాడు.)

ప్రకృతి : నవలోక నిర్మాణం తప్పదు. మానవుడా నీకు విజయం తథ్యం. (ప్రకృతి వెళ్ళిపోతుంది.)

వ్యాఖ్యాత : (Commentator) మానవుడు లేచాడు. నిద్రించే లోకాన్ని మేల్కొలిపాడు. ప్రజలకు పిలుపు అందించాడు!

మానవకంఠం : (నలుదిశలూ పరికిస్తూ) ఓహో మానవులారా! లేవండి! ఈ శాంతి సమరానికి సన్నద్ధులుకండి! మూల మూలలా, వాడవాడలా చైతన్య జ్యోతులు వెలిగించండి! ఈ నియంతృత్వాన్ని కూకటివ్రేళ్ళతో పెల్లగించండి! ఈ దోపిడీ విధానాన్ని సమూలంగా నాశనంచేయండి! అంత్య రక్తబిందువు భూస్థలి ప్రవహిల్లువరకు ఈ శాంతి సమరాన్ని సాగించి దుష్టశక్తుల్ని ఎదుర్కొండి! (ఒకవైపు నుండి కార్మికుడు, మరో వైపునుండి కర్షకుడు ప్రవేశిస్తారు.)

వ్యాఖ్యాత: (Commentator) లోకం కళ్ళు తెరచింది. మానవుడి పిలుపు ప్రజల గుండెల్లో ప్రతిధ్వనించింది. లేచారు! మానవులంతా లేచారు. కార్మికుడూ కర్షకుడూ ముందంజ వేశారు.

సైనికులం! సైనికులం!
శాంతి సమర నాయకులం!
శ్రామికులం! హాళికులం!
విశ్వశాంతి కాముకులం!
మేమంతా మానవులం!
మారణాంక రణస్థలిని
రూపుమాప సమకట్టిన
మహోద్యమ సాధకులం! ॥సైనికులం! సైనికులం!!

సుందరమగు సుప్రభాత
అరుణారుణ కాంతులలో
సువిశాల విశ్వజనని
శాంతి శోభహస్తంలో
శిక్షితులం! సైనికులం!
విలయ నృత్య పైశాచిక
యుద్ధభూమి పెల్లగించి
విమలరూప తేజోదయ
శాంతి ఛత్రఛాయలలో
జయపతాక ప్రతిష్ఠించు సైనికులం! సైనికులం!!

(నేపథ్య సంగీతాన్ని అనుసరిస్తూ మానవుడు, కార్మికుడు, కర్షకుడు, కదం తొక్కుతూ నృత్యంచేస్తారు).

వ్యాఖ్యాత: (Commentator) మానవులంతా ఏకమై మహోన్నత కార్యానికి పూనుకొన్నారు. తమ సందేశాన్ని లోకానికి అందిస్తున్నారు.

ఓహో హో హో నరులారా!
జగజ్జనత జనులారా!
ఈ వర్గపు సంఘర్షణ
లేనిలోక మొకటుందోయ్!
ఈతిబాధ లగుపించని
మరోప్రపంచ మదిగోనోయ్!

ఈ ద్వేషం, ఈ స్వార్థం
ఆలోకంలో లేవోయ్!
ఈ భేదా లీ వాదా
లా చోటున కనపడవోయ్!

యంత్రంతో పోరుసలిపి
యాచించే కార్మికుడా!
అహర్నిశలు అవనినీడ
పయనించే హాళికుడా!
కలలుగనే నవలోకం
సృష్టిద్దాం పదవోయీ!

కన్నబిడ్డ నెత్తుకొనీ
కడుపుచేత బట్టుకొనీ
పట్టెడు మెతుకులకోసం
పాటుపడే సహోదరీ!

కన్నతల్లి కన్నీరొలికని
ఆ లోకం పోదాం మన
మానందంతో ఉందాం!

రండి రండి నరులారా!
అసంఖ్యాక ప్రజలారా!
ప్రయాణమై కదలండీ!
ఐక్యతతో మనమంతా
అణుబాంబుల రణరంగం
అగుపించని ఆలోకం
సృష్టిద్దాం నడవండోయ్!
రారండోయ్! నడవండోయ్!

[నేపథ్య సంగీతాన్ని అనుసరించి మానవుడు, కార్మికుడు, కర్షకుడు నృత్యంచేస్తూ నిష్క్రమిస్తారు. ఒక్కక్షణం స్టేజి ఖాళీగా నిశ్శబ్దంగా ఉంటుంది. ఇంతలో రెండు యుద్ధభూతాలు రెండువైపులనుండీ ప్రవేశిస్తాయి.)

వ్యాఖ్యాత. (Commentator) ఇదుగో! వీరిని మీరెరుగుదురా? వీరు కాలాంతకులు; నరాంతకులుకూడా. జగత్తును తమ గుప్పిళ్ళలో పెట్టుకొని జనాన్ని పీడిస్తున్న పెనుభూతాలు వీరే. వీరు మానవజాతిలో పుట్టిన దానవులు. సంఘానికి వేరు పురుగులు. మానవ మేధస్సుతో సాధించిన 'అణుశక్తిని' తాము స్వాధీన పరచుకొని, దాన్ని మానవ సౌఖ్యంకొరకు ఉపయోగించకుండా, దానితో ప్రపంచాన్ని నాశనం చేయాలని చూస్తున్న పరమ కిరాతకులు. మేడలు, పాలరాతిగోడల భవనాలు, వీరి నివాససస్థలాలు. లక్షలకు, కోట్లకూ అధికారులు. తమ నియంతృత్వానికి ఎవరినీ ఎదురు

చెప్పకుండా చేయాలని వీరి ఆశయం. స్వార్థం, దురాశ, దుర్మార్గం, అవినీతి, అధికారం, వీరి ముఖ్యగుణాలు. వీరు పిలిస్తే యుద్ధాలు పరుగెత్తుకొని వస్తాయి. వీరు ఆజ్ఞాపిస్తే ప్రభుత్వాలు వణికిపోతాయి. వారేదో పాడుతున్నారు. వినండి !

వస్తూ ఉన్నాం వస్తూ ఉన్నాం ! వసుధాచక్రం ఏలేవారం !
భూతాలం మేం ప్రేతాలం ! భూతాలం మేం ప్రేతాలం!
జనసందోహాం ఛేదిస్తాం! భూగోళాన్ని కబళిస్తాం !
ప్రభుత్వాలనే మారుస్తాం! పదవులన్నిటిని భక్షిస్తాం !
ప్రపంచ యుద్ధం తెప్పిస్తాం! బంగరు మేడలు కట్టిస్తాం !
॥వస్తూఉన్నాం ! వస్తూఉన్నాం॥

మనుషులంత మా బానిసలూ, అణుబాంబులు మా హస్తగతం!
భూతలమంతా వణికిస్తాం! ఎదురు తిరిగితే మసిచేస్తాం!
అహా! హా! హా! అహా! హా! హా!
ఆహుతి! ఆహుతి! ఆహుతి! ఆహుతి!
నరబలి! నరబలి! నరబలి! నరబలి!
వార్, వార్, వరల్డ్ వార్!
సమరం! సమరం! ధ్వంసం! ధ్వంసం!
అహా! హా! హా! అహా! హా! హా!
ఆహుతి! ఆహుతి! ఆహుతి! ఆహుతి!
నరబలి! నరబలి! నరబలి! నరబలి!

(భూతాలు రెండూ భయంకరంగా విలయనృత్యం చేస్తాయి).

(తరువాత రెండుభూతాలు ఎవరికోసమో నాలుగుమూలలూ వెదుకుతుంటాయి. ఇంతలో 'సైంటిస్టు' ప్రవేశిస్తాడు. అతని చేతిలో A 1999 అనే నెంబరు గుర్తుగల గుండ్రని Ball ఒకటి ఉంటుంది).

వ్యాఖ్యాత: (Commentator) అదుగో! ఆ వచ్చే అతన్ని చూడండి! ఆతడొక సైంటిస్టు. గొప్ప విజ్ఞానవేత్త. భౌతిక, రసాయినిక, మానవ, జంతు, గణితశాస్త్రాల్ని క్షుణ్ణంగా చదివాడు. ఆమూలాగ్రం పరిశీలించాడు. అతని చేతిలో ఏదో ఉంది చూడండి. అదే అతడు తన విజ్ఞానంతో, తన మేధస్సుతో మానవ నాశనంకొరకు సృష్టించిన మహా మారణాయుధం. అతనేదో అంటున్నాడు వినండి.

సైంటిస్టు: ఓహో ధనికులారా! చక్రవర్తులారా! సామ్రాజ్యాధిపతులారా! మహా నియంతలారా! మేమనేక సంవత్సరాలుగా నిరంతరం కృషిచేసి, మా మేధస్సును కరిగించి, కొందరు కుబేరుల కోరికపై ఈ మారణాయుధాన్ని సృష్టించాం. ఇది ఆటంబాంబును మించింది. హైడ్రోజన్ బాంబును తలదన్నింది. మానవ విజ్ఞానానికి అంతిమ విజయంగా నేం సాధించిన 'మెషీన్ బాంబు' ఇది. ఇది మనిషి ఎక్కడున్నా సరే, వెంటాడి వేధించి చంపుతుంది. తన కిరణ ప్రసారంచేత సమస్త ప్రాణుల్ని మసిచేస్తుంది. దీని శక్తికి సృష్టిలోని సకల చేతనా చేతనాలు భస్మీపటలమైపోతాయి. ఈ బాంబు ప్రేలినప్పుడు ఇంకా ఎలా ఉంటుందో తెలుసా? ఎర్రగా ఎదిగిన చెట్లు శవాల్లాగా మారిపోతాయి. చంద్రుడిలా వికసించిన పుష్పాలు బొగ్గుల్లా అయిపోతాయి. పాలుకారుతూ నవనవలాడే తీగెలు గబ్బిలాల్లా ప్రేలాడపడతాయి. స్వచ్ఛంగా, రుచ్యంగా ఉండే నీటిమడుగులు కాలకూట విషమైపోతాయి. కాపురముండే ఇల్లు కటికి స్మశాన మవుతుంది. ధగ ధగ మెరిసే పట్టణం తారు పూసినట్లుంటుంది.

నిలుచున్న మనిషి బొమ్మలా అయిపోతాడు. చిరునవ్వులలో కులికే బిడ్డలు చిత్రంగా రక్తపుముద్ద లవుతారు. యౌవ్వనం తొణికే తల్లులు మసిపూసుకొన్న భూతంలా ఉంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ బాంబు ప్రేలిన ప్రదేశం చూస్తే అర్ధరాత్రి ఊరిబయట శ్మశానంలోకి వెళితే ఎలా ఉంటుందో అట్లా ఉంటుంది. దీన్ని గురించి యింతగా చెప్పవలసిన పనిలేదు. రండి! కొనండి! కోట్లు ఖర్చుపెట్టినా దొరకనట్టి మహత్తరాయుధం! ఈ అమూల్యమైన అవకాశాన్ని జారవిడుచుకోకండి. (కొద్ది క్షణాలు స్టేజిలో నిశ్శబ్దంగా ఉంటుంది) ఏం? కొనలేరా! యుద్ధాలు అత్యవసరమైన ఈ రోజుల్లోగూడ దీన్ని గురించలేదంటే నాకే సిగ్గుగా ఉంది. పోనీయండి! మీరు కొనకపోతే ఫ్రాంసుకు వెడతాను. ఇంగ్లండుకు పోతాను. వాళ్ళెవరూ కొనలేకపోయినా అమెరికా తప్పకుండా కొంటుంది. కొన్ని కోట్ల డాలర్లు ఇచ్చి అయినా కొని తీరుతుంది.

(భూతాలు ఒకదాని నొకటి చూచుకొంటాయి. నవ్వుకుంటాయి. సంతోషిస్తాయి. చంక లెగురవేస్తాయి. జేబుల్లోంచి సంచులు తీస్తాయి).

భూతాలు : ఆగండి! ఇదిగో మీ కెంత కావాలో తీసుకొని ఆ బాంబును మా కిచ్చివేయండి? (డబ్బు సంచులు విసిరివేస్తాయి. సైంటిస్టు సంతోషంతో డబ్బు తీసుకుంటాడు.) ఏం? చాలదూ? ఇంకా తీసుకోండి! అన్నీ డాలర్లే, (మరికొంత డబ్బు ఇవ్వగా సైంటిస్టు తీసుకొని బాంబు భూతాల చేతికిస్తాడు. వారు దాన్ని చేతిలో ఉంచుకొని ఆశ్చర్యంగా చూస్తుంటారు.)

సైంటిస్టు : దీనిశక్తి మీరు పరీక్షించాలనుకుంటే పసిఫిక్

సముద్రంలో పేల్చిచూడండి! (Pause) : ఆఁ! అడగడం మరిచాను. మీరు అమెరికా దేశస్థులా?

భూతాలు : దేనికి అలా అడుగుతున్నారు?

సైంటిస్టు : ఆఁ! ఏమీ లేదు. ఇంత డబ్బు ఎక్కణ్ణుంచి వచ్చిందో అని!

భూతాలు : దానికేంలేండి! మేమన్ని దేశాల్లోనూ ఉన్నాం. అమెరికాలో మా అధికారాలు పూర్తిగా వినియోగిస్తున్నాం. (భూతాలు ఒకదానినొకటి చూచుకొని నవ్వుకుంటాయి. సైంటిస్టు నిష్క్రమిస్తాడు.)

భూతాలు : అహా! హా! హా! గెలిచాం! సామాన్య మానవులతోబాటు మహా మేధావుల్ని గూడా బానిసలుగా చేసుకున్నాం! విజ్ఞానాన్ని వశపరచుకొన్నాం. అహా!హా!హా!

మానవ, కార్మి, కర్ష, (ప్రవేశిస్తారు.) ఆపండి! ఏమిటి మీరు చేస్తున్నది? బాంబులు వేసి ప్రజల శాంతి భద్రతలను పాడుచేయదలచుకున్నారా? మీకు హృదయం లేదా? మీ స్వార్థంకోసం మనుషుల్ని బలిచేస్తారా? దేశదేశాల మధ్య యుద్ధాలు లేవదీసి మారణాయుధాలతో మానవుల్ని మసిచేసి, గ్రద్దల్లాగా వారి రక్త మాంసాల్ని పొడుచుకు తింటారా! మీకిది న్యాయం కాదు. ఇవి మనుషులు చేయవలసిన పనులు కావు. మా మాట విని ఈ దారుణమైన ప్రయత్నాల్ని విరమించండి! ఈ అణుశక్తిని మానవుల క్షేమం కొరకు వినియోగించండి!

భూతాలు : అహా! హా! హా! ఎవరు మీరు? పనికిమాలిన మనుషులేనా? మీరు మాకు చెప్పొచ్చారా? మా బాని

సలుగా బ్రతుకుతున్న మీకు ఇంత అహంకారమా? ఏవో సిద్ధాంతాలు చెపుతున్నారే. యుద్ధాలు ఒకరు ఆపితే ఆగేవి కాదు. అవి చరిత్రయొక్క ప్రతి పుటలోనూ స్థిరమైన స్థానాన్ని ఆక్రమించుకున్నాయి. పిచ్చివాళ్ళు. మమ్మల్ని తెలుసుకోని మాట్లాడండి!

మానవ, కార్మి, కర్షక కంఠాలు: తెలుసు. మీరు మాకు బాగా తెలుసు! సృష్ట్యాదినుండి నేటివరకూ మనుషుల్ని పీడిస్తున్న రాక్షసులు మీరేనని తెలుసు! మీ ఇంట్లో నౌకరుగా, మీపొలంలో కూలీగా, మీ ఫ్యాక్టరీలో పని వాడుగా, మీ కాళ్ళక్రింద చెప్పుగా మనిషిని బానిసగా చేసుకున్న మహామహులు మీరు తెలియక పోవడమేమిటి? కాని మేము చివరిమాటగా చెప్పదలచుకున్న దొక్కటే. మన కీ వర్గకలహం వద్దు. ఈ హెచ్చుతగ్గుల భేదాలు రద్దు చేయండి! మనమంతా కలిసి మెలిసి ఉందాం? సృష్టిలోని వస్తుసంపదను సమానంగా అనుభవిద్దాం! పంటలు పండించి, పరిశ్రమలు నెలకొల్పి, ఖనిజాల్ని వృద్ధిచేసి ఈ భూమండ లాన్ని స్వర్గతుల్యంగా చేద్దాం! ప్రపంచంలో శాంతి సౌభాగ్యాల్ని సుస్థిరపరుద్దాం! ఇక మానవు లీ బానిసత్వాన్ని సహించలేరు. ఈ దాస్యశృంఖలాల్ని తెగనరుకుతారు. విశాల విశ్వవిజేతలగు కోటానుకోట్ల మానవులు మహా సముద్రంలా పొంగివస్తున్నారు. దీన్నెవ్వరూ ఆపలేరు. మామాట వినండి! ఆఖరిసారిగా చెపుతున్నాం. మాలో కలిసిపోండి! మీ అణుబాంబులు మాపై పనిచేయలేవు.

మీరు మాలో కలిస్తే ఆ మహాశక్తిని అత్యుత్తమ జీవిత సాధనగా తయారుచేస్తాం.

భూతాలు : అహా! హా! హా! Brutes మాకే అడ్డుచెప్తున్నారుగా! మాకు ఎదురు తిరిగినవాళ్ళను ఏంచేస్తామో తెలుసా! నల్లుల్లా నలిపేస్తాం! అహా! హా! హా! ఇదిగో! మెషీన్ బాంబు. నామరూపాలు లేకుండాపోతారు. మా అధికారానికి తలొగ్గి వెనుకటిలాగనే ఊడిగం చేయండి! లేకపోతే మీ బ్రతుకులే లేవనుకోండి! జాగ్రత్త!

మానవ, కార్మి, కర్షక కంఠాలు : అయితే రండి! పొంగిపొర్లే ఈ ప్రజావాహినిపై మీ ఉక్కు రథాల్ని నడిపించండి! అకుంఠిత దీక్షతో అనంత విశ్వాన్ని అధిగమించి వస్తున్న ఈ మానవ సమూహంపై బాంబులు కురిపించి మా రక్తంలో పురుగులై చావండి! ఇక సహించం! సహించలేం! ఎగసిపో ముందుకు తున్న మానవ కంఠాలు బ్రహ్మాండాన్ని బ్రద్దలు కొడతాయి. భూనభోంతరాళాల్ని ప్రతిధ్వనింపజేస్తాయి! ఈ 'ఆటంశక్తి'ని ఎదుర్కొంటాం! దీన్ని మీరు దుర్వినియోగ పరిస్తే చూచి సహించలేం. ఈ జగత్ప్రజల శాంతి మహోద్యమం జయించి తీరుతుంది! రండి! పోరండి! ఈ ప్రజా సమరంలో, ఈ శాంతి సమరంలో మమ్మల్ని గెల్చి పొండి!

(కొద్ది నిముషాలవరకు భూతాల్కు మానవుల మధ్య సమరం జరుగుతుంది)

వ్యాఖ్యాత : (Commentator) ఎదురు తిరిగారు. మానవులంతా ఎదురుతిరిగారు. ప్రపంచ శాంతికోసం, ప్రజారాజ్యం కోసం, మానవలోకం బలికావడానికి సిద్ధపడింది. నిశ్చయంతో చలించకుండా వున్న మానవ లోకంపై యుద్ధ

భూతాలు 'బాంబు' వేయడానికి సిద్ధపడ్డాయి. కాబోతూ వుంది, మానవలోకం మసి కాబోతూవుంది. సుందరమైన భూగోళం మహా శ్మశానం కాబోతూవుంది. సైంటిస్టు చూచాడు. గ్రహించాడు. తను సాధించిన విజ్ఞానం లోకంలో ఎలా ఉపయోగపడబోతున్నదో కళ్ళారా చూచాడు. అతని కళ్ళముందు తెర తొలగిపోయింది. ధన కాంక్షచే తన జ్ఞాన కాంతిని స్వార్థపరుల హస్తగతంచేసి నందుకు చింతపడ్డాడు. అతనికి పశ్చాత్తాపం కలిగింది. అతనిలో పరివర్తన వచ్చింది. ఇప్పుడైనా మించిపోలేదు. అతనివద్ద అసంఖ్యాకమైన వైజ్ఞానిక శక్తులున్నాయి. వాటితో ఈ ఆటమికశక్తిని అతడు అణచివేయగలడు. అందుకే మానవుల్లోచేరి వారి రక్షణ కొరకే తన విజ్ఞా నాన్ని వినియోగించ నిశ్చయించుకొన్నాడు. ఒక్క దూకులోవచ్చి మానవ సమూహంలో చేరిపోయినాడు. (సైంటిస్టు వచ్చి మానవుల్లో చేరిపోతాడు.) తను చేసిన తప్పిదానికి కంట తడిబెట్టాడు. మానవులంతా మహదానందంతో అతన్ని కౌగలించుకున్నారు.

సైంటిస్టు : అహా! హా! హా! (వికటంగా నవ్వి) ఇక మీ ఆటలు కట్టినవి. బాంబును ప్రేల్చటానికి ప్రయత్నించారా, ముందు మీరే సర్వనాశన మవుతారు, (జేబులోంచి అనేక రంగులుగల గుండ్రని Balls కొన్ని బయటికి తీస్తాడు.) ఇవిగో! విలువలేని విజ్ఞాన మణులు. ఇవి మావద్ద వున్నంతవరకూ 'ఆటంబాంబు' మాపై పనిచేయదు. వదిలేయండి. తక్షణం బాంబును వదిలేసి వెళ్ళిపోండి.

వ్యాఖ్యాత : భూతాలకు భయం కలిగింది. ఏదో ఆత్మశక్తి ఆవేశించినట్లుగా వణుకుతున్నారు. వాళ్ళకు బాంబును ప్రేల్చేశక్తి నశించింది. వాళ్ళకళ్ళు మూతలుపడుతున్నవి. చేతుల్లోని బాంబు జారిపోయింది. బాంబు బరబర జరగి మానవులవైపు పోతూవుంది. భూతాలు మంత్ర ముగ్ధుల్లా చూస్తున్నాయి. బాగా మైకం కమ్మిన వాళ్ళ కళ్ళకు ఏదో స్వప్న దృశ్యం గోచరమవుతుంది.

(తెర వాలుతుంది. పల్చని రంగుతెరలోంచి Spot Lights వెలుగు రులో భూతాలు స్వప్నాన్ని కంటున్నట్లుగా కనపడుతుంది. తిరిగీ తెర లేస్తుంది.)

వ్యాఖ్యాత : భూతాలకు నిరంతరం హృదయంలో మెదులుతున్న వాంఛయే స్వప్నంలో సాక్షాత్కరించింది. ఆ స్వప్నంలో వాళ్ళు "ఆటం"ను ప్రేలుస్తారు. (భూమి పగిలినంతగా పెద్దధ్వని, పొగలూ స్టేజి అంతా వ్యాపించి ఉంటుంది. జీవరాసులన్నీ ఆ అయోమయంలో ఈదులాడుతున్నట్లు కనపడుతుంది.) అదుగో మృత్యువు. భయంకరమైన మృత్యువు. (విరియబోసిన జుట్టు, నల్లనిఛాయ, నల్లనిదుస్తులు, పొడుగాటి దంతాలు, మిడిగ్రుడ్లు, భయంకరంగా ఉంటుంది). హాహాకారాలు చేస్తూ మనుష్యులపై ఎగబడుతోంది! కొమ్ముల్లాంటి కోరలు తెరుస్తోంది! కత్తుల్లాంటి గోళ్ళను విప్పి వికటాట్టహాసం చేస్తోంది. కాలుతున్న కొలిమిలా వున్న నాలుకను చాస్తోంది. కాని మానవులు చలించటంలేదు. మహామేరువులై నిలబడుతున్నారు. వారిలో అంతర్యాభతమైయున్న ఆత్మశక్తి పెల్లుబుకుతోంది. మానవులు మత్తగజాల్లా విజృంభిస్తున్నారు. ఎర్రని సూర్యులై

ఎదిరిస్తున్నారు. మృత్యువునే పడమోదుతున్నారు. వారి చైతన్యశక్తి ముందు మృత్యువు నిలవలేక పోతోంది. మానవులు అజేయులు! అమరులు! అదిగో! మృత్యువు పారిపోతోంది.

(తెరవాలుతుంది. తిరిగి తెర లేచేసరికి స్టేజిమీద యుద్ధ భూతాలు గజగజ వణకుతూ నిద్రమత్తునుండి లేస్తుంటాయి.)

(ఎదురుగా మానవులు కనిపిస్తారు.)

మానవ కంఠాలు: కలలు కంటున్నారా? అయిపోయింది. మీ శకం చెల్లిపోయింది. ఈ అణుశక్తిని, ఈ మహాశక్తిని, మేం స్వాధీనం చేసుకున్నాం. దీనితో మానవ జీవితాన్ని సౌఖ్యవంతం చేస్తాం. అద్భుతమైన యంత్రాల్ని సృష్టిస్తాం! అమోఘమైన వస్తువుల్ని వుత్పత్తి చేస్తాం. మానవులు, అమరులు! చిరంజీవులు. ఇకనుండి ఈ భూగోళం శాంతి నిలయం. ఈ భూమి మానవులది. మానవులందరికీ దీనిపై సమానమైన హక్కు వుంటుంది. యుద్ధాలు, కరువులు, ఆకలి చావులు, దారిద్ర్యం, లేకుండా ఈ ధరిత్రి శాంతి సౌభాగ్యాలకు నిలయంగా శోభిల్లుతుంది.

(మానవులు భూతాల్ని పట్టుకుంటారు. వెనుకనుండి విజయసూచకంగా పెద్ద ధ్వని వినిపిస్తుంది. స్టేజీ అంతటా ఎర్రనికాంతి వ్యాపిస్తుంది. మానవుడు, కార్మికుడు, కర్షకుడు, మరికొంతమంది ప్రజలు, ప్రకృతి అందరూ ఒకచేతిలో (Candles) వెలుగుతుండగా మరొక చేతితో తెల్లని పావురాళ్ళను ఎగురవేస్తూ నృత్యం చేస్తారు.)

(నేపథ్య సంగీతం)

జయం జయం! శాంతి జయం!

జయం జయం! జన విజయం!

జయం జయం! శాంతి జయం!
జయం జయం! దిగ్విజయం!

శాంతీ! శాంతీ! శాంతీ! శాంతీ!

కన్న తల్లి కడుపు శాంతి!
చిరునవ్వుల పాపశాంతి!
విప్లవ వీరులకు శాంతి!
విమల నేత్రి భువికి శాంతి!

శ్రామికాళి యువజనాళి
చేతి ఎరుపురేఖ శాంతి!
ప్రచండాగ్ని చెలరేగిన
ప్రజాకోటి మనశ్శాంతి!

చైతన్య జ్యోతి కాంతి
జగతిని వ్యాపించిందీ!
జగత్ప్రజల శాంత్యుద్యమ
జయ పతాక నిలిచిందీ!

జయం జయం! శాంతి జయం!
జయం జయం! జన విజయం!
జయం జయం! శాంతి జయం
జయం జయం! దిగ్విజయం!

శాంతీ! శాంతీ! శాంతీ! శాంతీ!

(తెర)



కాలం : 1950

ప్రదేశం : మద్రాసు నగరం

పాత్రలు :

శారద

రామనాథం

మధుమూర్తి

వెంకట్రామయ్య

ఈ నాటిక తొలి సారిగా 2-10-1951 తేదీన విజయవాడలో ఆంధ్ర ఆర్టు థియేటరు వారిచే జయప్రదంగా ప్రదర్శించబడింది.

ఆనాటి నటవర్గం :

| | | |
|---|---|---|
| శారద | : | శ్రీమతి నిర్మల |
| రామనాథం | : | శ్రీ లక్ష్మీనరసయ్య |
| మధుమూర్తి | : | శ్రీ మధుసూధనరావు |
| వెంకట్రామయ్య | : | శ్రీ ఆదిశేషయ్య |



# శిక్ష

(మద్రాసు నగరంలో ఒక మేడక్రింద గది. గదిలో ఒకవైపు డ్రాయరు, కుర్చీ, డ్రాయరుపై గుండ్రని పెద్దసైజు అద్దం, దువ్వెన, అలారంటైంపీసు, రెండు పుస్తకాలు, ఒకకృష్ణుడి బొమ్మ, గోడకు చొక్కాలు తగిలించే వంకీ, వంకీకి తగిలించిన లెదరుబ్యాగు, జరీకండువా, డ్రాయరు ప్రక్కగా రెండు ట్రంకుపెట్టెలు ఒకదానిపై ఒకటి పెట్టబడి ఉంటాయి. రెండవ వైపు ఒక పడకకుర్చీ, ఒక మామూలు కుర్చీ. అది రాత్రి 8 గంటల సమయం.)

రామనాథం: వయస్సు 40. తెల్లని ధోవతి, లాల్చీ, సన్నగా, పొడుగ్గా ఉంటాడు. అక్కడక్కడ తెల్లని వెంట్రుకలతో చెరిగిన క్రాపు, ముఖంలో తీవ్రమైన ఆలోచన, ఆందోళన, అనుమానం, చిరాకు ప్రస్ఫుట మౌతూ ఉంటాయి. చేతిలో చిన్న ఫొటో ఉంటుంది. దాన్ని ముఖానికి దగ్గరగ పెట్టుకొని అప్పుడప్పుడు చూస్తూ అటూ, ఇటూ తిరుగుతుంటాడు. క్షణక్షణానికి అతని ముఖంలో ఏవేవో ఆలోచనలు, అనుమానాలు, మొలకెత్తి అంతలో మాయమౌతూ ఉంటాయి. మేడపైనుండి రేడియోపాట మెల్లగా వినిపిస్తూ ఉంటుంది.

నీజీవిత నిజరూపము తెలుసుకోవదేలా!
నిరంభాగ్యుల నీడలలో దుర్భ్రమ నీకేలా!
సత్యపథ విధానములో మృత్యువు కబళించె నిన్ను
లోకం ఒక వధ్య శిలై శోకంలో ముంచె నిన్ను
ఈ ధరణిని శపిస్తూ నీ తనువును విడుస్తావో!
ప్రగతిని కాంక్షిస్తూ ఈజగతిని శాసిస్తావో!

శారద: [పాట అయిపోయేసరికి లోపలనుండి ప్రవేశిస్తుంది. వయస్సు 18. కోమలమైన శరీరం. ఎర్రని సిల్కుచీర, అదే రంగు జాకెట్టు, తల్లో పూలు. శారద రావడం గమనించి రామనాథం తన చేతిలోని ఫోటోను జేబులో దాచు కుంటాడు. శారద మెల్లగా సమీపిస్తుంది. ఆమె రావడం అతనికి అయిష్టాన్ని కలిగిస్తుంది.]

శార : ఏమిటి? ఆలోచిస్తున్నారు.

రామ : ఈ పైవాళ్ళు రేడియో ఆపివేస్తే బాగుండు. చెవిలో ఒకటే రొద.

శార : మనకు లేకపోగా ఇతర్లు పెట్టుకుంటే వింటానికేం? అయినా కమ్మని పాట పాడుతుంటే...

రామ : (మాట్లాడడు. అటూ, ఇటూ, తిరుగుతూ ఉంటాడు.)

శార : జీవితంలోని యథార్థం ఏమిటో తెలుసుకోమని బోధిస్తూ ఉంది. మీకెలా ఉందో కాని నాకుమాత్రం చాలా బాగుంది.

రామ : అసహ్యంగా ఉంది.

శార : ఏం? అలా అంటారు. మన జన్మరహస్యం తెలుసుకోమని చెప్పడం గొప్పవిషయం కాదా? మనం ఎందుకోసం పుట్టామో, ఏం చేస్తున్నామో? ..

రామ : (అయిష్టంగా) నన్ను మాట్లాడించకు. నా మనస్సు బాగాలేదు.

శార : రేడియో ఆపివేశారులెండి. ఇక భోజనానికి లేస్తారా?

రామ : నా కాకలి కావడంలేదు.

శార : ఏం? కోపం వచ్చిందా?

రామ: చెప్పానుగా. నావంట్లో బాగాలేదు. మాట్లాడించకుండా వెళ్ళు.

శార : (మెల్లగా) ఎందుకండీ అలా కోపంగా ఉన్నారు. మీరు చెప్పినట్లే ఉంటున్నానుగా!

రామ : (మాట్లాడడు. పడక కుర్చీలో కూర్చుంటాడు. శారద మెల్లగా దగ్గరకు వస్తుంది).

శార : (ఆతని కోపం తగ్గించాలని ప్రయత్నిస్తూ) ఇదంతా మీకోసం కాకపోతే మరెవరికోసం చెప్పండి. (గడ్డం పట్టుకొని) ఒక మారు ఇటుచూడండి. మీకోసం నా జీవితాన్నంతా మార్చుకోలేదూ? ఇతర్లెవర్నీ రానివ్వడంలేదు. చూస్తున్నారుగా! ప్రతిక్షణం మీదగ్గరే, మీ ఇష్టంవచ్చినట్లు హాయిగా......

రామ : (ఆమెచేయి తీసివేస్తాడు. కుర్చీనుండి లేచి మళ్ళీ ఇటూ, అటూ, తిరుగుతూ ఉంటాడు.)

శార : ఈవాళ ఎందుకో మీలో చాల మార్పు కనపడుతూ ఉంది. కారణం తెలియడం లేదు. ఈ నాలుగు నెలల్లో ఎన్నడైనా ఇట్లాలేరు. ఒక్క క్షణంకూడా మౌనంగా ఉండేవారు కాదు. పక్కన కూర్చోబెట్టుకొని ఏవేవో కబుర్లు...ఎంతో సంతోషంగా ఉండేవాళ్ళం. లోకంలో భార్యాభర్తలయినా మనం ఉన్నట్లు ఉండరు.

రామ : (మాట్లాడడు. లేచి ఏదో బాధపడుతూ ఉంటాడు)

శార : మీరు బాధపడ్డానికి కారణం ఏదో నాకు బొత్తిగా అర్థం కావడంలేదు. పోనీ మీరు చెప్పకూడదూ ఏంచేశానో. మామూలుగా వచ్చేవాండ్లందరినీ రావద్దన్నానా! బయటికి వెళ్ళడంకూడా మానేశానా! నిత్యం మీ సుఖంకోసం, మిమ్ములను సంతృప్తి పరచడంకోసం, నే చేయగలిగినదంతా చేస్తున్నానా! (కొంచెం కోపంగా) తప్పు చూపించకుండా బిగించుకుంటే ఏం లాభం?

రామ : (అక్కడ ఉండడం ఇష్టంలేక బయటికి వెడదామనుకుంటాడు.)

శార : (దగ్గరకు వచ్చి) పోనీ కాఫీ తీసుకురానా? చెప్పండి. మాట్లాడరేం?

రామ : (అయిష్టంగా) నా సంగతి తెలుసుకోవాలని ప్రయత్నించకుండా ఉంటే, నీకూ నాకూకూడా... (రెండడుగులు ముందుకు వేస్తాడు.)

శార : (దిగులుగా) ఈ వాళ ఎవరిముఖం చూశానో మధ్యాహ్నం నుంచి ఇంట్లో ఉండడమే మీకు కష్టం అయింది. ఇప్పుడొచ్చారు. ఎంత మొత్తుకున్నా సమాధానం చెప్పరు. పోనీ కొంచెం కాఫీ త్రాగి విశ్రాంతి తీసుకోండి. (ఆమె లోపలికి వెళ్ళబోతుంది.)

రాము : (బయటికి వెళ్లిపోబోతాడు. శారద వచ్చి వాకిలికి అడ్డంగా నిలుచుంటుంది. రామనాథం ఆమెను తోసేసి వెళ్లిపోతాడు. ఆమె కూడా వాకిట్లోకి వెళ్లి, అతను వెళ్లిపోవడం చూచి తిరిగీ లోపలకు వస్తుంది. విచారంగా తలపట్టుకొని కూర్చుని ఉంటుంది.)

మధుమూర్తి : (ప్రవేశిస్తాడు. వయస్సు 24. ఉంగరాలు తిరిగిన క్రాపు, సూటు వేసుకుని ఉంటాడు. శారదకు వెనుక పక్కగా నిలుచుంటాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం. శారద తలఎత్తి అతన్ని చూస్తుంది ఆతృతతో జుట్టు సవరించుకొని)

శార : కూర్చోండి (కుర్చీ జరుపుతుంది).

మధు : ఏమిటి సుధా ? అలా ఉన్నావేం ?

శార : ఏమీ లేదు.

మధు : అరగంటబట్టీ ప్రయత్నం రావాలని. రాఘవయ్యగారు ఇంట్లోనే ఉంటారని మళ్ళీ తటపటాయించా. అప్పట్నించీ ఆమూల తిరుగుల్లోనే నిలుచున్నా. ఇప్పుడాయన అటు వెళ్లడంచూసి...

శార : [ఆతృతతో] ఆయన్ను నీవు చూశావా ? ఎక్కడికి వెళ్లారు?

మధు : బజారువైపు వెళ్తున్నట్లుంది. ఏం? విశేషాలు ఏం లేవు గదా!

శార : [దీనంగా] మధూ! క్షమించు. నీవు రావడం చూస్తే ఆయన ఏమైనా అనుమానపడతాడేమో అని నాభయం. అసలు ఈవాళ ఆయన ధోరణే వేరుగావుంది.

మధు : రాఘవయ్యగారిని చూస్తే ఆడంబరం ఏమీ కనపడదు. మనిషి చాల శాంతంగా ఉంటాడు. లోగడ నీవుకూడా చెప్పావుగా, ఆయన ఎంతో మంచివాడని.

శార : ఈ నాలుగు నెల్లనుంచీ ఎంత కావల్సినా ఇస్తున్నారు. ఆయన కిష్టమైనవన్నీ చేసి పెడుతున్నా. కమ్మగా తింటున్నాం. సుఖంగానే గడచిపోయింది. ఈ రోజు ఆయనలో ఎన్నడూలేని మార్పు వచ్చింది. ఏదో చికాకు. తెలుసుకోవాలని ఎంత ప్రయత్నించినా...

మధు : నే వచ్చి పోతున్న సంగతి ఆయనకేమైనా తెలిసిందా? నిజంగా నీవేమైనా అనుకో. ఊళ్లో ఉంటే ఒక్కసారిఅయినా నిన్ను కలుసుకొని మంచిచెడ్డలు మాట్లాడకపోతే నాకేదో బాధగా ఉంటుంది సుధా. మనస్సు తృప్తిగా ఉండదు.

శార : నాకు తెలుసు. కాని ఏంచేయను. నావల్ల నీవు పొందే సుఖం లేకపోయినా, ఆర్థికంగా బాధపడుతుంటే అనేకసార్లు ఆదుకున్నావు. నీ మేలు ఎన్నటికీ మరిచిపోలేను.

మధు : ఆరోజు స్టేషనులో నీవు తొలిసారి కలుసుకున్నప్పుడు

నాకు తెలియకుండానే నా మనస్సు నీకు లొంగిపోయింది. తర్వాత నిన్ను చూడకుండా ఉండడమనే కష్టం అనిపించింది. అసలు కొన్ని రోజులవరకూ నిన్ను మా ఇంట్లోనే ఉంచుకుందా మనుకున్నాను. కాని పరిస్థితులు మనల్ని దూరం చేసినవి.

శార : ఇంకానయం. నామూలాన బంగారంవంటి మీ ఇంట్లో కలతలు బయలుదేరేవి. నేను ఆరోజునే రావడం మంచిదయింది. తర్వాత మీ వాళ్లు ఏమైనా అన్నారా?

మధు : ఆc! ఏమంటారు. ఏవేవో గుసగుసలాడారు. పెండ్లి పెటాకులు లేకుండా తిరుగుతున్నాననీ, వ్యాపారం సంగతే పట్టించుకోవడం లేదనీ, ఏదేదో అన్నారు. నేను వాళ్ళ మాటలు లెక్క చేస్తానా!

శార : ఆమధ్య ఏవో సంబంధాలు వచ్చాయని చెప్పావుగా! ఏమైంది?

మధు : ప్రస్తుతం నా పరిస్థితులు బాగా లేవు సుధా! మనస్సుకు ఆందోళన, దిగులూ, అన్నీ వక్కసారే వచ్చాయి. అసలు పెండ్లి ప్రయత్నం చేయదలచుకోలేదు.

శార : ఏం? మీ బిజినెస్ ఎట్లావుంది? బంగారం ధర పెరిగిందటగా!

మధు : అది ఎప్పుడూ పెరిగే ఉంటుందిలే. అయినా నాకు వ్యాపారం విషయాల్లో ఎప్పుడూ భయం లేదు.

శార : మరింకేమిటి? మీ ఇంట్లో ఏమైనా తగాదాలు వచ్చాయా?

మధు : నా స్వంతవిషయంలోనే కొంత పనిచేయాల్సి వచ్చింది. అందునిమిత్తమే ఈమధ్య బొంబాయి వెళ్లాను.

శార : పని పూర్తి అయిందా?

మధు : ఆ పని అంత సులభంగా అయ్యేది కాదు. నేరస్థుణ్ణి పట్టుకోవడమంటే సామాన్యమా?

శార : [ఆశ్చర్యంతో] నేరస్థుడా? ఎవరూ?

మధు : ఇటీవల ఒక ఆడమనిషి హత్య చేయబడింది. హంతకుడి ఆచూకి తీయాల్సి వచ్చింది. బొంబాయి అంతా గాలించాను. ఎక్కడా కూపీ దొరకలేదు. చివరకు వాడు కలకత్తా వెళ్లినట్లు తెలిసింది.

శార : [కొంచెం భయంతో] హత్యా! ఇంత చిన్నతనంలో మీారిలాంటి పనుల్లో జోక్యం కలిగించుకోవడం నాకేమీా బాగా లేదు.

మధు : వాణ్ణి ఊరికే వదలి పెడ్తానా? అక్కణ్ణుంచి కలకత్తా వెళ్ళాను. ఎంత డబ్బు ఖర్చుపెట్టినా ఫలితం శూన్యం. వాడు అక్కణ్ణుంచి తిరిగీ మద్రాసు వచ్చినట్లు చెప్పారు.

శార : ఎందుకీ గొడవల్లో పడ్డం. పరిస్థితులు బాగా లేవు. పైపెచ్చు ఏదైనా....

మధు : ప్రమాదం వస్తుందనా? (ఉద్రేకంతో జేబులోనుంచి రివాల్వరు తీస్తాడు.) దగ్గరే ఉంచుకున్నా వాడు కనపడితే చాలు.

శార : (ఏకితురాలై) అమ్మో! నీ చర్యలుచూస్తే నాకేదో భయంగా ఉంది. నీకెందుకు ఇందులో జోక్యం.

మధు : (విచారంగా) పద్ధానుగేండ్ల క్రితం వాడే నా తండ్రిని

హత్యచేశాడు. ఇప్పుడు అన్యాయంగా మరొక ఆడమనిషిని. అందుకే ఈ పనిలోకి దిగాల్సి వచ్చింది. పోలీసులుకూడా ఇప్పుడు వాణ్ణి వెదుకుతున్నారు. నీవు చెప్పు సుధా? ఇది నావిధ్యుక్తధర్మం కాదూ? (ఉద్రేకంతో) నాతండ్రిని చంపిన వాణ్ణి ఎలా వదిలిపెట్టగలను. నాహృదయం సహిస్తుందా?

శార : (ఆశ్చర్యం, భయం) నీ తండ్రి...నీతండ్రిని హత్యచేశారా? ఎన్నడూ నాతో చెప్పలేదేం?

మధు : అవును. అవకాశం లేకపోయింది. క్రూరంగా, అన్యాయంగా, ఆయన చంపబడ్డాడు.

శార : మీ కెవరైనా విరోధులున్నారా ?

మధు : ఎవ్వరూ లేరు. ఆయన పెద్ద వ్యాపారస్థుడనీ, మర్యాదస్థుడనీ పేరు సంపాయించాడు.

శార : ఏమీ కారణంలేకుండా, ఇంతపని...

మధు : నా తండ్రిదగ్గర డబ్బుండటమే. ఆ దఫా ఇరవై అయిదు వేల రూపాయలు పట్టుకవెళ్ళాట్ట. నా తండ్రీ, ఆయన స్నేహితుడూ కలిసి బొంబాయి వెళ్ళారు.

శార : ఏం జరిగిందీ ?

మధు : అక్కడొక హోటల్లో బస చేశారు. అప్పట్లో ఆ హోటలంటే ఆంధ్రులందరూ గొప్పగా చెప్పుకునే వారులే.

శార : అబ్బ ! అసలు సంగతి చెప్పండి.

మధు : నా తండ్రీ, ఆయన స్నేహితుడూ ఒకే గదిలో పడుకున్నారు. అర్థరాత్రి ఒక దుర్మార్గుడు నా తండ్రిని హత్యచేసి, ఆ ఇరవై అయిదువేలూ కాజేశాడు.

శార : గిట్టని వాళ్లెవరో చేసిఉంటారు.

మధు : ఎవరో కాదు. ఆ హోటలు ప్రొప్రయిటరు వెంకట్రామయ్యే! రౌడీ వెధవ.

శార : పాపిష్టి డబ్బు. ఎంతపని అయినా చేయిస్తుంది. అయినా వెంకట్రామయ్యే హత్యచేశాడని మీకేమిటి నమ్మకం?

మధు : సందేహం ఎందుకు? అతనే చేశాడు. ముమ్మాటికీ ఆతనే. నాదగ్గర బోలెడు సాక్ష్యం ఉంది. పద్ధానుగేండ్ల క్రితం ఆ హోటల్లో పనిచేసిన నౌకరు ఇప్పుడున్నాడు. పాపం! అన్యాయంగా రామనాథానికి శిక్ష పడింది.

శార : (షాక్) రామనాథం ఎవరూ?

మధు : ఆయనే. నా తండ్రి స్నేహితుడు. ఏదో కొద్ది డబ్బుతో వ్యాపారం చేసుకుందామని నా తండ్రితో కలిసి బొంబాయి వెళ్ళాడు. అనుకున్నది ఒకటయితే మరొకటి జరిగింది.

శార : ఏమీ ఎరగని రామనాథంగారిపై నేరం ఎట్లా మోపారు? కోర్టు కళ్ళు మూసుకున్నదా? వెంకట్రామయ్యను పట్టుకోలేదూ?

మధు : కోర్టు ఏంచేస్తుంది. డబ్బుగలవాళ్ళకు దాసోహం అంటుంది. చెవులతో వింటుందిగాని, కండ్లతో చూడలేదు. అసలు సత్యాన్ని తెలుసుకొని తీర్పు చెప్పే జడ్జీలు ఎంత మంది ఉన్నారు? నిజంవైపు ఎన్ని కేసులు గెలుస్తున్నాయి.

శార : పాపం! రామనాథంగారు తాను నిర్దోషినని చెప్పుకో లేకపోయాడా?

మధు : ఆ పని చేస్తే యిందాకా ఎందుకు వస్తుంది? అతడు వతి

అమాయకుడూ, మూర్ఖుడూను. లేకపోతే ఎవరైనా ఊరు కుంటాడా? హత్య ఎవడో చేయడమేమిటి? నిష్కారణంగా నేరం తనపై పడితే కోర్టులో గొంతెత్తి ఒక్క మాట అయినా చెప్పుకోలేదు.

శార : (రామనాథాన్ని చిన్నపరచడం సహించలేకపోతుంది) ఆయన్ను అనడం దేనికిలేండి. అసలు దరిద్రుడిమాట ఎవడు లెక్క చేస్తాడు. అశక్తుడు కనుకనే ఏమీ చెప్పలేకపోయి ఉంటాడు.

మధు : ఆ మాటే నేనూ అనడం. వెంకట్రామయ్య అందులో పదివేలు తనవి కావని, అందరినీ స్వాధీనం చేసుకుంటే, యీయన ఒక లాయరునైనా పెట్టుకోలేదట. ఆఖరు క్షణంలో ఒక స్నేహితుడొచ్చి వాదిస్తే ఉరిశిక్ష తప్పిపోయి, జ్యూరీస్ అభిప్రాయం ప్రకారం పద్ధానుగేండ్లు కఠినశిక్ష పడింది.

శార : ఆయన్ను ఏమీ అనకండీ? నాకేదో బాధగా ఉంటుంది.

మధు : ఉన్నమాట అన్నాను. అయినా నీకేం కష్టం. నాతండ్రి స్నేహితుడు గనుక రామనాథాన్ని తప్పక గౌరవిస్తాను. ఆయన్ను అవమానించడం నా కిష్టంకాదు. అయినా లౌకికాన్ని తెలుసుకోక, అంత నెమ్మదిగా ప్రవర్తించి, ఈ క్రూరసంఘానికి బలిఅయిపోయి, చివరకు తన జీవితాన్ని పాడుచేసుకున్నాడూ" అంటాను.

శార : (సహించలేక) మధూ! నీకొక మాట చెప్తాను. ఏమీ అనుకోవుకదూ?

మధు : సుధా! నేను పరాయివాణ్ణా? నా మనస్సు నీకు తెలి

యదూ? నీవు నాతో నిర్భయంగా మాట్లాడొచ్చు. నీ వేమి చెప్పినా నేను ఆనందంతో స్వీకరిస్తాను.

శార : (దుఃఖంతో అటూ, ఇటూ, తిరుగుతూ) నాలో, నా హృదయంలో, నా జీవిత రంగంలో దాగిఉన్న ఒక్క ముఖ్య రహస్యాన్ని నీకిప్పుడు చెప్పదలచాను. అది అనేక సంవత్సరాలుగా నాలో అణచిపెట్టబడి కుళ్ళి కుమిలిపోతున్నది. ఇక ఇప్పుడు బహిర్గతం చేయకుండా ఉండలేను.

మధు : అదేమిటి సుధా! ఈరోజు అంతా కొత్తగా మాట్లాడుతున్నావు. నిన్ను బాధించే అంత ముఖ్యమైన రహస్యమేమిటో వెంటనే చెప్పేయి. నేనేమైనా చేయగలిగి ఉంటే తప్పక చేస్తాను.

శార : (సందేహిస్తూ) నీ వేమీ చేయక్కర్లేదు. అది నా జీవిత పరిణామానికి సంబంధించిన ముఖ్యవిషయం. నీ వెప్పుడూ ఎవ్వరితోనూ, చెప్పకూడదుసుమా!

మధు : ఇంకా సందేహిస్తున్నావా? నేనూ నీ కెన్నటికి అపకారం చేయలేను. చేయను. అలా అనుకునేవాణ్ణయితే నే నిన్ని ఇబ్బందుల్లో ఉండికూడా నీ పరిస్థితి తెలుసుకోవాలని ఎందుకొస్తాను. ఇదిగో ప్రమాణం చేస్తున్నాను. (చేతిలో చేయి వేస్తాడు.) ఆ విషయం ఏమిటో చెప్పు.

శార : (కొంచెం నిబ్బరంగా) ఏమీ లేదు. నే నీ వృత్తిలో ఉన్నా, నా మనస్సెప్పుడో నీ స్వాధీనం అయింది. అందువల్లనే ఇప్పు డీ విషయాన్ని చెప్పగలుగుతున్నా. ఇంతకు ముందు నుంచీ నీవు చెపుతున్న ఆ రామనాథంగారే నా తండ్రి. ఆయనకు నేను ఏకైక పుత్రికను. నా అసలు పేరు శారద.

మధు : (షాక్; ఒక్క క్షణం నిశ్శబ్దం) ఏమిటీ? ఇది నిజమేనా? ఎన్నడైనా చెప్పావు కావేం? (విచారంతో) రామనాథంగారు నా తండ్రికి ప్రాణస్నేహితుడు. నా తండ్రికి ఆయనపై ఎంతో గౌరవమట. అటువంటివాడి కడుపున పుట్టిన నీకు చివరకు లోకానికి అమ్ముడుపోవాల్సిన గతి పట్టిందా ?

శార : (దీనంగా) నీ విలా అంటావని నాకుముందే తెలుసు. అందు కని మొదటే చెప్పాను. నన్ను తప్పుగా అర్థం చేసుకోకుండా ఉంటే అసలు సంగతి చెప్తానని. నా గడచిపోయిన చరిత్ర పూర్తిగా తెలిస్తే నీ విలా అనవు.

మధు . అందుకేగా ఇదివరకు ఎందుకు చెప్పలేదని అంటున్నది.

శార : జీవిత లక్ష్యాన్నుంచి పతనమైన నేను ఈ రహస్యాన్ని నీతో చెప్పడానికి సిగ్గుపడ్డాను. నీకే కాదు. ఎవ్వరికీ చెప్పలేదు.

మధు : అయిందేదో అయిపోయింది. ఇప్పుడైనా నీ పూర్తి వివరాలు తెలియజేయి. మీ నాన్న జైలుకు వెళ్ళేసరికి నీవు చిన్న పిల్లవు కదా? తర్వాత మీ అమ్మ ఏమైంది?

శార : (విచారంతో) మధూ! ఇప్పుడా విషయాలు ఏమీ ఎత్తకు. అదంతా ఒక విషాద గాథ. తలుచుకుంటే నాగుండె పగిలి పోతుంది. తర్వాత ఎప్పుడైనా తీరిగ్గా చెపుతాను. ఆయన వెళ్ళి చాలా సేపయింది. బహుశా వస్తుంటారేమో?

మధు : ఇది మనకు చాలా అవసరమైన విషయం. నీవు ఫలానా అని తెలిసిన తర్వాత వినకుండా, ఎలా ఉండగలుగుతాను. రాఘవయ్యగారు బజారుకు వెళ్ళి ఉంటారు.

(రామనాథం సిగరెట్టు కాలుస్తూ ప్రవేశిస్తాడు. ఆయనలో ఆతురత, విషాదం కనిపిస్తూ ఉంటాయి. అతన్ని చూచి శారద, మధూ నిర్ఘాంత పోతారు. రామనాథం కుర్చీలో కూర్చుంటాడు.)

రామ : (గంభీరంగా) సుధా! ఇలా రా!

శార : (కొంచెం ఆశ్చర్యంతో దగ్గరకువచ్చి నిలుచుంటుంది.)

రామ : నీవు ఇదివరకు ఎక్కడెక్కడ ఉన్నావో, నీపుట్టుపూర్వోత్తరాలు ఏమిటో, నీ తల్లిదండ్రు లెవరో, నాకుచెప్పు.

శార : (ఆశ్చర్యం, భయంతో, రామనాథం వైపు చూస్తూ నిలుచుంటుంది.)

రామ : ఏం? ఆశ్చర్యపడుతున్నావా? నాకు తెలుసు. నేనంతా విన్నాను.

శార : మీ మాటలు ఏమిటో...

రామ : వింతగా ఉన్నాయా? ఎందుకూ? (గంభీరంగా) ఇంతకు ముందునుంచీ మీ ఇద్దరికీ జరిగిన సంభాషణ అంతా నేను వాకిట్లో నిలబడి విన్నాను. ఇప్పటికైనా చెప్పు. అసలు నీ తల్లిదండ్రు లెవరు?

(శారద, మధూ, నిర్ఘాంతపోతారు. శారద ఇక తన విషయం చెప్పక తప్పదని అనుకుంటుంది.)

శార : (విషాదంతో) నా తండ్రి ఒక అమాయకుడూ, కటిక దరిద్రుడూను. ఆయన పేరు రామనాథంగారు.

రామ : నీ తండ్రి ఉమాకాంతం అని చెప్పావు కదూ? నీ పేరు సుధేనా? అబద్ధం ఎందుకాడావు? ఏం?

శార : అవును. పవిత్ర జీవితాన్ని గడిపిన నాతండ్రికీ, ఆయన వంశానికీ నామూలాన కళంకం కలగటం నా కిష్టంలేదు. అందుకే ఆయన అసలుపేరు దాచి, మీకు ఉమాకాంతం

గారని చెప్పాను. నా పేరు మార్చుకుని సుధ, అని పెట్టు కున్నాను.

రామ: నీ తండ్రి అంత మంచివాడా?

శార: ఆయన బి. ఏ, దాకా చదువుకున్నాడు. ఉద్యోగం దొరక్క అనేక బాధలు పడి చివరకు మార్వాడీ గుమాస్తాగా చేరాడు.

మధు: ఇంకా నయం. దానికైనా పనికి వచ్చాడు.

శార: ఆయన చాలా తెలివైనవాట్ట. మూడేండ్లు మార్వాడీ దగ్గర బండచాకిరీ చేసి తన రక్తాన్ని ధారపోసి దమ్మిడీ సంపాయించలేకపోయాడే కాని, వాళ్ళ తప్పుడు లెఖలన్నీ ఇన్ కంటాక్సు, సేల్సుటాక్సువాళ్ళకు దొరక్కుండా చేసేవాట్ట.

రామ: ఇంకేం. నిజాయితీ కలవాడన్నమాట.

మధు: న్యాయంగా వుంటే ఈ రోజుల్లో కూడుదొరుకుతుందా?

శార: అటువంటివాడు కనుకనే ఏదో సంపాయించుకుందామని బొంబాయి వెళ్ళి అన్యాయంగా కేసులో ఇరుక్కుని జైలుకు పోయాడు.

రామ: నీ తల్లి...

శార: మా అమ్మ పేరు మీనాక్షి. కలవారి ఆడబిడ్డ. మా తాత ప్లీడరు. పేరుకు పెద్ద న్యాయవాది. న్యాయంమాత్రం శూన్యం. మాకూ ఆయనకూ పడదు. మా అమ్మను ఆయన గడపకూడా తొక్కనిచ్చే వాడు కాదు. ఆయన ఇష్టం లేకుండా తనతో చదువుకున్న రామనాథం గార్ని ప్రేమించి పెండ్లి చేసుకుందట. అదీ నేరం. రామనాథంగారు

తిండికి లేనివాడని, ఈ పని చేయడంవల్ల తన గౌరవప్రతిష్టలు పోయినవనీ, మా తాత మాపై కక్షకట్టాడు. దాన్ని సాధించుకోవాలనే, చివరకు తప్పుడు సంతకాలు పెట్టించుకొని మా పెంకుటిల్లుకూడా కాజేశాడు.

మధు : పదిమంది చెడితే ఒకడు బాగుపడుతుంటాడు. దుర్మార్గులు.

శార : ఎన్నో పుకార్లు పుట్టించాడు మా తాత. మా నాన్న దొంగనీ, దగాకోరు అనీ, చివరకు హంతకుడనీకూడా చాటించాడు.

మధు : మీ అమ్మ అయినా నిన్ను పోషించుకోలేక పోయిందా?

శార : నాతండ్రి జైలుకు వెళ్ళేనాటికి నాకు మూడేండ్లు. నన్ను పెంచడానికి మా అమ్మ ఎన్ని కష్టాలు పడ్డదో. నాకు బుద్ధి తెలిసే నాటికి ఆమె ఎప్పుడూ దగ్గుతో, జ్వరంతో బాధ పడుతూ ఉండేది. తన కడుపు మాడ్చుకొని నాకు పెట్టేది.

రామ : (కుర్చీనుండి లేచి పిచ్చివాడిలా ఇటూ, అటూ, తిరుగుతూ ఉంటాడు.)

శార : ఉపవాసాలవల్ల ఆమె ఆరోగ్యం రాను రాను క్షీణించింది. ఆ దగ్గు క్షయక్రిందికి మారింది. అక్కడ ఉండటానికి వీల్లేదని మేం ఉన్న పూరిపాకనుంచి వెళ్ళగొట్టారు. ఎట్లాగో సత్రంలో కాస్త నీడ దొరికింది. వారం అయినతర్వాత సత్రంలో ఉంటే అద్దె ఇవ్వాలన్నారు. ఖాళీ చేయాల్సి వచ్చింది.

రామ : దరిద్రులను వారి నీడకూడా, వారిని విడిచేస్తుంది.

శార : తర్వాత కొద్ది రోజులకే మా అమ్మ కళ్లు మూసింది.

మేము యమయాతన అనుభవిస్తుంటే ఈ పాడు ప్రపంచం మమ్మల్ని ఏమేమో ఆడి పోసుకుంది. మా అమ్మ కులట అనీ, ఏవేవో చేసి సంపాయిస్తున్నదనీ. చివరకు నేనుకూడా పదిమందిలో... (కండ్లవెంట నీళ్లు) నా చిరిగిన జాకెట్లు, సగం వళ్లు కనపడే పరికిణీ, రేగిన జుట్టూ, వాళ్ల కంటికి నిగర్వి నాలుగా కనపడేవి.

రామ : (కుంగిపోతూ) చివరకు లోకులు అనుకున్నట్లే అయిందిగా!

శార : అవును. నా బ్రతుకు రోసిపోయింది. మా అమ్మ పోయిం తర్వాత ఎందరినో ఆశ్రయించాను. మా తాత దగ్గరకి వెళ్తే, నన్ను వాకిట్లో నిలబెట్టి తిట్టిపోశాడు. మా మామ త్రాగుబోతు. నన్ను తనదానిగా చేసుకోవాలని అబ్బ! ఎంత నీచంగా ప్రవర్తించాడు. చివరకు బజారుకెక్కా. నలుగురు నాలుగు విధాలుగా మాట్లాడేవారు. అందరూ అదోమాది రిగా చూచేవారు.

మధు : పెండ్లి చేసుకోలేకపోయావా?

శార : (కటువుగా) పెండ్లి! ఈ సంఘంలో అదొక ముండ్లకంప. వేలకు వేలు కట్నాలిస్తామంటుంటేనే మొగుళ్ళు దొరకటం లేదు ఆడపిల్లలకు. దిక్కులేనిదాన్ని నన్నెవరంటే...

రామ : మీ అమ్మ చనిపోయేముందు నీ తండ్రి విషయం ఏమీ చెప్పలేదా?

శార : ఒక నెల రోజులకు పోతుందనగా ఏదో ఊరు వెళ్ళి వచ్చింది. మా నాయన ఎంతో మంచివాడనీ, మా కోసం ఎన్నో కష్టాలుపడి జైలుకు వెళ్ళాడనీ చెప్పింది. ఆయన తిరిగి వస్తాడనే ఆశకూడ నాలో నశించింది. లోకులు తలా

ఒక రాయి విసరితే నే నిలా అయిపోయ్యాను. దరిద్రం నన్ను ప్రపంచానికి అమ్మింది. నా బోటి నిర్భాగ్యురాలు ఈ లోకంలో బాగా బ్రతకడానికి ఇదేమంచి మార్గమనుకున్నా.

మధు : సుధా! ఇంతకుముందు నాతో చెప్తే ఇలా జరిగేదికాదు. ఇప్పుడైనా మించిపోలేదు. నీ తండ్రి ఎక్కడ ఉన్నాడో తప్పక విచారిస్తాను. నీవు ఆయన్ను గురించి దుఃఖ పడక్కర్లేదు

శార : నాకున్న కోరిక అది ఒక్కటే. నే చచ్చిపోయేలోగా ఒక్కసారి అయినా నా తండ్రిని చూస్తానా అని. జంతువు లకు తమ తండ్రి ఎవరో తెలియదు. నేనూ అంతే. నాకంటే అవి నయం.

రామ : లోకం అంతా ఆడిపోసుకునే అతనిపై నీ కెందుకు సానుభూతి? నీకుమాత్రం ఏం చేశాడని; చివరకు చేతి మీదుగా ఒక్క పరికిణీ కుట్టించాడూ ?

శార : ఉంటే ఎన్ని చేసేవాడో! ఒకవేళ ఏం చేయకపోయినా, నా తండ్రిగనుక నిస్వార్థంగా ప్రేమిస్తాను. ఆదరిస్తాను. చివరి క్షణంవరకూ ఉపచర్య చేస్తాను. ఆయన ఏం చేసినా మా కోసమే చేసి ఉంటాడు. మా అమ్మ చనిపోతూ చివరి మాటలు చెప్పింది. మీ నాయన వస్తే నేను లేని లోటు తీర్చమ్మా" అని.

రామ : పిచ్చిపిల్లా! హాఁ, దొంగతనమో చేసిన దుర్మా ర్గుణ్ణి ఆదరిస్తావా? ఈ సంఘం నీపై బ్రహ్మరాక్షసిలా విరు చుకు పడుతుంది సుమా! సుఖంగా గడుస్తున్న నీ జీవి తానికి అదొక సమస్య అవుతుంది...సంఘం.

శార : (ఉద్రేకంగా) సంఘమా! అది నా జీవితానికి సంకెళ్ళు వేసింది. నాకో సంఘం ఉందా ? [రుద్ధకంఠంతో] నన్ను శాసించేది, నా గతిని పట్టించుకునేది. కులటలకు సంఘం లేదు. సంఘంలో పెరగలేదు.

రామ : ఒకవేళ నీ తండ్రి వస్తేమాత్రం ఈ స్థితిలో ఉన్న నిన్ను చూచి ఊరుకోగలడా ?

శార : నే చేసిన పనికి క్షమాపణ వేడుకుంటాను. భవిష్యత్తులో అయినా, నా కేదో దారి చూపించకపోడు.

రామ : [జేబులోనుంచి ఫొటోతీసి] ఈ ఫొటో ఎవరిది ?

శార : (కొంచెం కోపంగా) అదెక్కణ్ణుంచి వచ్చింది మీకు. (వేగంగా పెట్టెదగ్గరకు వెళ్ళి లోపల వెతుకుతుంది) నా పెట్టె అడుగున ఉన్న ఫొటో మీరెందుకు తీయాల్సి వచ్చింది ?

రామ : ఎందుకంత కోపం? నీవు దాచుకోవచ్చును గాని, నేను తీయడం తప్పయిందేం ? (ఫొటోను చూపిస్తూ) ఇందులో ఉన్న పిల్ల ఎవరు ?

శార : నేనే. దాంతో మీ కేం పని. అది నా చిన్నతనంలో నా తల్లిదండ్రులు తీయించుకున్న ఫొటో. అదొక్కటే నా జీవితసత్యానికి గుర్తు. నాకు మిగిలిపోయిన సొత్తు.

రామ : (ఏదో విపరీతంగా బాధపడ్తాడు. తల పట్టుకొని లేస్తాడు.) నా తల పగిలిపోతూంది. (లోపలికి వెళ్ళిపోతాడు)

[శారద, మధుమూర్తి అతనివైపు తదేక దీక్షతో చూస్తారు.]

శార : నా ఫొటో ఎందుకు తీసుకున్నారో అర్థం కావడంలేదు. అసలు దాంతో ఆయన కేం పని వచ్చింది.

మధు : నాకూ, ఆశ్చర్యంగానే ఉంది. పైగా ఆయన ఏదో అనారోగ్యంగా, ఆందోళనగా కనపడుతున్నాడు.

శార : ఈపూట భోజనంకూడా చేయలేదు.

మధు : నేను వచ్చానని తప్పుగా అర్థం చేసుకోడుగదా ?

శార : మీరిప్పుడేకా వచ్చింది. ఆయన సాయంకాలంనుంచీ అలాగే ఉన్నారు. ఎన్నిసార్లు అడిగినా కారణం చెప్పలేదు.

(వెంకట్రామయ్య ప్రవేశిస్తాడు. వయస్సు 38. బలమైన శరీరం, మాసిన బట్టలు, పెరిగిన గడ్డం, ఏదో ఇబ్బందుల్లో ఉన్నవాడిలా అగుపడతాడు. శారద, మధుమూర్తి అతనివైపు ఆశ్చర్యంగా చూస్తారు.)

వెంక : (తొట్రుపాటుతో) ఈ ఇల్లు ...

శార : మాదే.

వెంక : ఇక్కడ ఉండేది...

శార : మేమే ఉంటున్నాం. మీరెవరు ? ఎందుకొచ్చారు ?

వెంక : (తడబడుతూ) నేను...నేనొక నిర్భాగ్యుణ్ని. మీరు నాకొక్క సహాయం చేయాలి. (కొంచెం భయం, వణుకు.)

మధు : సంగతేమిటో చెప్పండి.

శార : ఏం ? అలా వణకుతున్నారు.

వెంక : (నిబ్బరంగా) నా పరిస్థితి బాగాలేదండీ. చాలా కష్టాల్లో ఉన్నాను.

శార : పాపం ! ఎవరో అమాయకుడిలా ఉన్నాడు.

మధు : అవును. విషయమేమిటో తెలుసుకుందాం.

శార : కూర్చోండి. మీకేం భయంలేదు. (వెంకట్రామయ్య కుర్చీలో కూర్చుంటాడు)

మధు : మీరు వచ్చిన పని ఏమిటో పూర్తిగా చెప్పండి.

వెంక : ఏమీ లేదు. నా దాయాదులకు, నాకూ పేచీ వచ్చింది. వాళ్ళు నాతో పోట్లాడి చివరకు వెళ్ళగొట్టారు.

శార : మీకు భార్యాబిడ్డలు లేరూ ?

వెంక : నా భార్య చనిపోయి చాలా ఏండ్లయింది. నా కొక్కడే కొడుకు. చిన్నతనంలోనే బర్మా వెళ్ళాడు. ఇప్పు డక్కడే ఉద్యోగం చేస్తున్నాడు.

మధు : మీ దగ్గర ఆస్తి ఏమైనా ఉందా ?

వెంక : సెంటు పొలంకూడా లేదు.

శార : ఆస్తికోసం కాదూ మీ దాయాదులు పోట్లాడింది.

వెంక : ఇదివరకు నే నీ పట్నంలోనే వ్యాపారం చేశానండి. చాలా డబ్బుకూడా వచ్చింది.

శార : ఇంకేం అయితే...

వెంక : ఇటీవలనే బిజినెస్ ఆపుచేయాల్సి వచ్చింది. ఉన్న డబ్బును నా దగ్గరే ఉంచుకొని మా ఊరు వెళ్ళాను.

మధు : ఆ డబ్బుకోసమే మీ వాళ్ళు నీతో పేచీపడి ఉంటారు.

వెంక : అవును. మొదట్లో కొంచెం ప్రేమగానే చూచారు. తర్వాత నేను సంపాయించుకున్న సొమ్ము తమ కివ్వ మన్నారు. నే నందుకు అంగీకరించనందున చావ చితక కొట్టారు. తప్పించుకొని వచ్చా.

శార : పాపం ! సొమ్ముకోసం ప్రాణాలు తీస్తారా ?

వెంక : మీకున్న జాలి వాండ్ల కెందు కుంటుందమ్మా ? నా చేత బలాత్కారంగా సంతకం పెట్టించుకోవాలని చూచారు.

ఇప్పు డా డబ్బు నాదగ్గ రే ఉంది. నన్ను పట్టుకోమని రౌడీ లను పంపారు. నా కేదో భయంగా ఉంది. నన్ను వాళ్ళు వెంటాడుతూనే ఉన్నారు.

మధు : పాపిష్టి డబ్బు. దానికి ఎంతటివారైనా లొంగిపోతారు. ఏమైనా చేస్తారు.

వెంక : దిక్కులేని వాణ్ణి. మీరు నా కొక్కటే సహాయం చేయాలి.

శార : ఏమిటది ?

వెంక : ఈ రాత్రికిక్కడే ఉంటాను. మీరు రక్షణ ఇవ్వాలి.

(శారద, మధుమూర్తి, ఒకరివైపు ఒకరు చూచుకుంటారు.)

వెంక : ఏం ? సందేహిస్తున్నారా ?

శార : మధూ ! నీ వేమంటావు ?

మధు : అనే దేమున్నది. ఆత నెవరో మనకు తెలియదు. పుణ్యానికి పోతే పాపం రాదుకదా అని.

శార : నీవు చెప్పింది నిజమే. కాని మనిషి చాలా మంచి వాడిలా అగుపడుతున్నాడు. చూస్తే జాలి వేస్తోంది.

మధు : మనిషికి మనిషి సహాయం చేయకపోతే మరెవరు చేస్తారు? నా సందేహంఅల్లా ఆయన ఏమనుకుంటాడో అని.

శార : ఆయన పడుకున్నారు. ఎవరై తే ఏం ? అన్యాయంగా భాధపడి మనదగ్గరకి వచ్చాడు. ఈమాత్రం ఉపకారం అయినా చేయడం మన కనీస ధర్మం.

వెంక : ఏం ? ఆలోచిస్తున్నారా ? (కొంచెం పెద్దగా) అవును, ఈ లోకంలో అంతే. ఒకణ్ణి ఒకడు హింసిస్తుంటే తన పని

కానట్లు చూస్తూ ఊరుకుంటారు. పోనీయండి, నా మీద మీకు దయకలక్కపోతే వెళ్ళిపోతాను. (లేవబోతాడు)

మధు : నీ ఇష్టం సుధా ! అతనికి ఆశ్రయం ఇవ్వడం నాకిష్టమే.

శార : నేనూ అదే అంటున్నా. (అతనితో) మీ రీ రాత్రి కిక్కడే ఉండండి. ప్రొద్దున్నే వెళ్దురుగాని.

(రామనాథం, లోపలినుండి ప్రవేశిస్తాడు)

శార : మీరు పడుకోలేదూ ?

రామ : (మాట్లాడడు. వెంకట్రామయ్యను చూస్తాడు. ఏదో జ్ఞాపకంతెచ్చుకుంటాడు. అతనిలో ఉద్రేకం, ఉద్వేగం కలుగుతాయి) నీవు...... నీ వింకా బ్రతికే వున్నావా ? బొంబాయినుండి ఎప్పుడు వచ్చావు? (వెంకట్రామయ్య కంగారు పడతాడు. తనను ఎట్లా పలకరిస్తున్నాడా అనుకుంటాడు. మాట్లాడకుండా రామనాథంవైపే చూస్తూ వుంటాడు.)

రామ :(పెద్దగా) మాట్లాడవేం ? ఇక్కడి కెందు కొచ్చావు ?

వెంక : మీ మాటలు నా కాశ్చర్యంగా వున్నాయి. మీ రెవరో......

రామ : నీ విదివరకు బొంబాయిలో వుండలా ?

శార : ఆయన ఎవరో దాయాదులతో తగాదా పడ్డారటండీ !

రామ : పచ్చి అబద్ధం ! (అతనితో) ఏం ? అలా వున్నావ్ ? నీ హోట లిప్పుడు నడవడంలా ?

వెంక : మీ మాటలు నాకర్థం కావడంలేదు. మీ రెవరో నాకు తెలియదు.

రామ : అవును. మర్చిపోయి వుంటావులే. (కోపంగా) నీవు బొంబాయిలో హోటలు పెట్టలా? నీ పేరు వెంకట్రామయ్య

కదూ? జ్ఞాపకం తెచ్చుకో పద్ధానుగేండ్ల క్రితం...నీవు చేసిన పని.

వెంక: (షాక్) (శారద, మధుమూర్తి ఆశ్చర్యంగా చూస్తూ నిలుచుంటారు)

వెంక: అంతా మీరు నన్ను ఎరిగినట్లు మాట్లాడుతున్నారు. మీరు ఎవర్ని చూసి... ..

రామ: (కోపంతో పెద్దగా) వెంకట్రామయ్యా! ఇంకా నన్ను మోసం చేయాలని చూస్తున్నావా? హంతకుడా! నీ సెనకో నాకు తెలుసు. పద్ధానుగేండ్ల క్రితం, 1935 అగస్టు 6 వ తేదీని నీ వొకర్ని హత్య చేయలేదూ? చెప్పవేం?

వెంక: (నిర్జీవుడై కూర్చుని ఉంటాడు.)

శార: మీా కేం తెలుసు?

రామ: నే నప్పుడు అక్కడే వున్నానులే (అతనితో) నీ మూలాన మరొకడు జైలుకు వెళ్ళలా? మాట్లాడవేం?

వెంక: (మాట్లాడడు. కొంచెం భయం.)

మధు: ఇత నెవరో మంచివాడనుకున్నామే. ఏవో కష్టాల్లో వున్నానని చెప్పాడు. అయినా ఇతను మీా కెలా తెలుసు?

రామ: మధూ! నాకంతా తెలుసు. నీ తండ్రి "ప్రసాదు"ను హత్య చేసింది ఇతనే. (అతనితో) ఏం? నీవు కాదూ? నీవే నని దేశమందరికీ తెలుసు.

(మధుమూర్తి, శారద, ఏమీ తోచనట్లుగా నిలబడి ఉంటారు.)

వెంక: (లేస్తాడు) మీారు నన్ను తప్పుగా అర్థంచేసుకుంటున్నారు. అనవసరంగా అనుమానిస్తున్నారు. మీారు చెప్పే వెంకట్రామయ్యకూ, నాకూ, ఏమీా సంబంధం లేదు.

రామ : ఇంకా నన్ను బుకాయించాలని చూస్తున్నావా ? అదిగో! నీబుగ్గన పుట్టుమచ్చ. నీవు హోటలు ప్రొప్రయిటరు వెంకట్రామయ్యవే ! సందేహం లేదు. మధూ ! ఆనాటి రాత్రి నీ తండ్రిని చంపి, ఇరవై అయిదు వేలూ కాజేసింది వీడే. ఏమీ ఎరగని అమాయకుడు రామనాథాన్ని జైలుకు పంపింది వీడే. (అతనితో) మళ్ళీ ఇక్కడికి వచ్చావా ? ఇంకా తృప్తి తీరలా ?

మధు : వీడా ! వీడేనా ! నా తండ్రిని హత్య చేసింది? వీణ్ణి పట్టుకోవాలని ఎంతో ప్రయత్నించానే.

శార : ఇదంతా నాకేదో కలలాగా వుంది. నా తండ్రిని ఇతను జైలుకు పంపాడా ?

వెంక : (కొంచెం పెద్దగా) మీరు నిష్కారణంగా నన్ను అనుమానించి నిందిస్తున్నారు. మీరు చెప్పే సంఘటనకూ, నాకూ, ఏమీ సంబంధం లేదు. అప్పు డెప్పుడో ఎవరో చేసిన హత్య, ఇప్పుడు నా మీద రుద్దుతున్నారు.

రామ : మధూ ! ఇంకా నా మాటయందు నమ్మకం లేదా ? (విసురుగా వెంకట్రామయ్య దగ్గరకు వెళ్ళి అతన్ని పట్టుకుంటాడు. చొక్కా పైకి ఎత్తుతాడు. బొడ్లో కత్తి ఉంటుంది.) చూశారా ? ఇతనిదగ్గర ఎప్పుడూ కత్తి వుంటుందని నాకు తెలుసు. ఈ కత్తితోనే నీ తండ్రిని పొట్టన పెట్టుకున్నాడు. శారద తండ్రిని జైలుకు పంపాడు. (అంటూ విసురుగా అతన్ని తోస్తాడు.)

(వెంకట్రామయ్య పారిపోవాలని ప్రయత్నిస్తాడు. కాని మధుమూర్తి వాకిలివైపు వచ్చి, అతనికి అడ్డంగా నిలబడ్డంవల్ల వీలు కాకపోతుంది.)

మధు : రాఘవయ్యగారూ ! నా కిప్పుడంతా అర్థమైంది. ఇక

మీాకుండండి. వీడు నాకాజన్మవిరోధి. వీడికోసం పట్నాలన్నీ తిరిగివచ్చా. పోలీసులుకూడా వెతుకుతున్నారు. (అతనితో) హంతకుడా ! ఎక్కడికి వెళ్ళిపోతావ్ ? (రివాల్వరుతీసి గురి పెడతాడు.)

శార : మధూ ! ఆగు ! ఆ పని నీవు చెయ్యొద్దు. ఇతన్ని నా చేతిమీాదుగా చంపుతాను. నా తండ్రిని అన్యాయంగా జైలుకు పంపాడు. అదేదిగులుతో మాఅమ్మ చనిపోయింది. చివరకు నా జీవిత మిలా శూన్యమై పోవటానికీ, నా బ్రతు కిలా పాడు కావటానికీ, వీడే కారణం. అందుకే ఆ పని నేను చేస్తాను. నా తండ్రి పగ తీర్చుకుంటాను. ఇందుకు నేనే తగినదాన్ని.

మధు : సుధా ! నీవు చిన్నపిల్లవు. నీకు ధైర్యం తక్కువ. వీణ్ణి చంపలేక వదిలిపెటతావేమో ? వద్దు నేనే పూర్తి చేస్తాను.

శార : మధూ ! వీల్లేదు. రివాల్వరు ఇలా ఇవ్వు. మన ఇద్దరి ద్వేషాగ్నిలో వీడు మాడిపోతాడు. సంతోషంగా ఈ పని నేను చేస్తాను. (మధునుండి రివాల్వరు లాక్కొని గురిపెడుతుంది. వెంకట్రామయ్య వెనక్కి తగ్గుతుంటాడు. శారద రెండడుగులు ముందుకు వేసి వెగటుగా నవ్వుతుంది.) ఏం ? ఇంతటి ఘోరాన్ని చేస్తున్నామని అను కుంటున్నావా ? నీవంటి దుర్మార్గుడు ఈ లోకంనుంచి వెళ్ళిపోవడమే మంచిది. నీవు చేసిన పనికి ఈ శిక్ష చాలుతుందో లేదో ?

రామ : (ఉద్రేకంగా) ఆగండి ! మీారిద్దరూ పసిబిడ్డలు. మీా కింకా బోలెడు అనుభవం కావాలి. నేను వయస్సులో

పెద్దవాణ్ణి. అన్నీ అనుభవించిన వాణ్ణి. వీడిపై పగ తీర్చు కోటానికి నాకే హక్కుంది. నేనే అందుకు తగినవాణ్ణి. (ఆమెనుండి రివాల్వరు తీసుకుంటాడు అతనివైపు రివాల్వరుచూపిస్తూ) పారిపోవాలని ప్రయత్నించకు, ఏమీ లాభంలేదు. ఇది నా జీవితంలో, నీ జీవితంలో తుది అధ్యాయం. ఆనందంగా ముగుస్తుంది. మంగళగీతం వినిపిస్తుంది. అంతా సంతోషిద్దాం. (బయటినుండి పోలీసు విజిల్సు వినబడతాయి. వెంకట్రామయ్య అటూ, ఇటూ చూస్తాడు.)

రామ : అహాహా ! హా ! (పెద్దగా నవ్వుతాడు. తానే కాల్చుకుంటాడు. రివాల్వరు ప్రేలిన ధ్వని. రామనాథం క్రింద పడిపోతాడు. వెంకట్రామయ్య పారిపోతాడు. బయట తిరిగి తుపాకులు కాల్చిన చప్పుడు వినబడుతుంది. అంతా ఒక్క క్షణం నిశ్శబ్దం. శారద, మధుమూర్తి, రామనాధాన్ని సమీపిస్తారు.)

శార : (దుఃఖకంఠంతో) మీరు......మీరు కాల్చుకున్నారా !

మధు : ఎంతపని చేశారు ?

రామ : (బాధపడుతూ, కడుపులో చెయ్యి పెట్టుకొని లేస్తాడు.) ఇలా రామ్మా ! ఒక్కసారి ఇలా రా !

(శారద దగ్గరకు వస్తుంది. తలపై చేయివేసి నిమురుతాడు.) నే నెవరో ఇంకా......అబ్బా !

మధు : మీ పేరు రాఘవయ్య కాదా ?

రామ : కాదు. నేరస్థుణ్ణి. తప్పు చేసినవాణ్ణి. అదుగో! బయట గోలగా వుంది. వెంకట్రామయ్య ఈ పాటికి......నేనూ పోతున్నా, నా కోసం దిగులు పడకండి. హాయిగా చచ్చిపోతున్నా. (శారదను చూస్తూ) నీ సాన్నిధ్యంలో, నీ చేతిమీదుగా...నా కింతకన్నా కావల్సిందేముంది ?అబ్బ! బాధ

శారద : చివరకు ఆత్మహత్యకు ఒడిగట్టారా ?

రామ : అతను చేసిన హత్యకంటె ఘోరమైన నేరం మరొక టుంది. అది నేను చేశాను. దానికెవరూ శిక్ష విధించలేరు. నాకీ శాస్తి కావల్సిందే. ఇది నాకు తగిన శిక్ష. అబ్బ... శారదా...నా జీవితంలో ఎప్పుడూ బుద్ధిపూర్వకంగా తప్పుచేసి ఎరుగను. కాని ఈ లోకం నన్ను చూచి నవ్వింది. ఈ సంఘం నాకు సంకెళ్ళు వేసింది. ఈ వ్యవస్థ నా బ్రతుకును బలితీసుకుంది. ఈ అమానుషమైన నాగరికత నా గుండెలపై తొక్కుతూ నృత్యం చేసింది. ఈ కసాయి ప్రభుత్వం నా జీవితాన్ని చిదిమి వేసింది. ఈ లోకాన్ని శపిస్తున్నా! నేను చేయగలిగింది యింతే. నన్ను క్షమించు... (పడిపోతాడు)

శార : నాన్నా ! (అతనిపై వాలిపోతుంది.)

[తెర]



కాలం : 1951

ప్రదేశం : స్టేషనులో 'వెయిటింగ్ రూం'

సమయం : మధ్యాహ్నం

పాత్రలు :

కాపిటలిస్టు
జర్నలిస్టు
సోల్జెరు
జ్యోతిష్కుడు
మతప్రవక్త
మేనేజరు

# మూడో యుద్ధం

(స్టేషన్‌లో ఫస్టుక్లాసు వెయిటింగ్ రూం. ఒక రౌండు టేబులు, రెండు సోఫాలు, మూడు కుర్చీలు, టేబుల్ పైన చిన్న ఫ్లవర్ బెడ్ ఉంటాయి. రూంలో ఒక ప్రక్కగా ఒక లెదరుబాక్సు, బెడ్డింగు, ఒక అల్లికబుట్ట, ఉంటాయి. తెర ఎత్తేసరికి కాపిటలిస్టు కుర్చీలో కూర్చుని ద్రాక్షపండ్ల గుత్తి లోంచి ఒక్కొక్క పండు తీసుకుని తింటూ, అమెరికన్ పత్రిక తిరగవేస్తూ ఉంటాడు. అతని వయస్సు 40 సంవత్సరాలుంటాయి. అయినా నునుపైన మంచి రంగుగల శరీరం, కొంచెం లావుపాటి పొట్ట, ఖరీదైన సిల్కుసూటు, కళ్ళకు అద్దాలు, యువకుడిలా వుంటాడు. కుర్చీకి ఆనించి ఒక సన్నటి అందమైన చేతికర్ర వుంటుంది. అప్పుడప్పుడు రైళ్ళకూతలు, కూలీల కేకలు, అమ్మకునే కుర్రాళ్ళ అరుపులూ, వినిపిస్తుంటాయి. జ్యోతిష్కుడు ప్రవేశిస్తాడు. వయస్సు 45 సంవత్సరాలుంటాయి. పైన పండిత శాలువా. చెవులకు మకర కుండలాలు, నుదుట వెడల్పాటి కుంకుమ బొట్టు, చొక్కా వుండదు. వంటిపైన విభూతి రేఖలు కొంచెం అస్పష్టంగా కనపడుతూ వుంటాయి. మెళ్ళో రుద్రాక్షలు, చేతిలో పంచాంగం కాగితాల కట్ట.)

కాపిట : రండి సిద్ధాంతిగారూ! కూర్చోండి. (జ్యోతిష్కుడు కూర్చుంటాడు.) మా గుమాస్తా చెప్పాడా మీతో.

జ్యోతి : చిత్తం. మీరీ బండికే వెళ్తున్నట్లుగా చెప్పాడు. అందుకే తమతో కలుసుకుందామని వచ్చాను.

కాపిట : మరి నేను చెప్పింది చూచారా ?

జ్యోతి : చిత్తం. చిత్తం. నిన్నటినుండీ ఆపనిమీదే ఉన్నాను కదండీ.

కాపిట : ఏ మాలోచించారు ? ఇంతకూ యుద్ధం వస్తుందంటారా ? లేదా ?

జ్యోతి : సందేహంలేదు. తప్పకుండా వస్తుంది.

కాపిట : అవును. నాకు తెలుసు మరో ప్రపంచయుద్ధం తప్ప దని. అయినా గ్రహస్థితి ఎలావుందో అని, మిమ్మల్ని చూడ మన్నాను.

జ్యోతి : (పంచాంగం చూస్తూ, వేళ్ళు లెఖ్ఖపెడుతూ) ఈ సంవత్సరం రాజు శని. మంత్రికూడా శనే. ఇక సేనాధిపతి కుజు డయ్యాడు. వీటిని బట్టి యుద్ధాన్ని గురించి మనకు ప్రసిద్ధ మైన వార్తలు వినబడుతూ ఉంటాయి. ప్రపంచంలోని రాజ్యాలు, వాటి నాయకులు, పరస్పరం కలహప్రీతు లౌతారు. రక్తపాతం విపరీతంగా జరుగుతుంది.

కాపిట : Political గా చూస్తే అలాగే కనపడుతూ ఉంది. ఏ మూల చూచినా యుద్ధ సన్నాహాలే. ఎవరినోట విన్నా మూడవ యుద్ధం వస్తుందనే.

జ్యోతి : గ్రహస్థితిని పరిశీలించినకొద్దీ మూడవయుద్ధం తప్పదని తెలుతూవుంది. కొరియాలో భీషణ సంగ్రామం జరుగుతూ ఉందా ? రష్యా అమెరికాలకు రాజీ కుదిరే సూచనలేమీ కనిపించడం లేదు. అసలు కొరియా రంగమే మరో ప్రపంచ యుద్ధానికి దారి తీయువచ్చు.

కాపిట : వెరీగుడ్! వెరీగుడ్! అంతా నేను ఊహించినట్లే చెపుతున్నారు. ఆఁ! ఇక పాకిస్థానుకూ, మనకూ కూడా యుద్ధం తప్పదంటారా ?

జ్యోతి : తప్పదేమిటి ? ఈ పాటికప్పుడే ముప్పు ముంచుకొస్తుం టేను. (వేళ్ళు లెఖ్ఖపెడుతూ) ఈ సంవత్సరం ఇండియాకు గురువూ, పాకిస్థానుకు శుక్రుడూ అధిపతులైనారు. అందు

చేత ప్రజలంతా మతోన్మాదంతో పెచ్చుమీరి పోతారు. అసలీ రెండుగ్రహాలకూ పడదు. ఒకడు ఏట్లోకి గుంజితే, మరొకడు కాట్లోకి గుంజుతాడు. పైగా ఇద్దరికీ షష్ఠాష్టకం పట్టింది. ఇక చెప్పాల్సిందేముంది ?

కాపిట : బాగా చెప్పారు. కాశ్మీరు పోరాటమే మరొక World war గా మారవచ్చు. పత్రికల్లో వార్తలు చూస్తే అలాగే కనపడుతూ ఉంది.

జ్యోతి : స్పష్టంగా కనపడుతూ వుంది. కాశ్మీరు దేశానికి త్రిగ్రహకూటం గలిగింది. అప్పుడే ఒక గ్రహం దేశంలో ప్రవేశించి తన పని సాగిస్తూ వుంది.

కాపిట : ఆఁ! ఇక ధర ప్రతులు ఎట్లా వుంటయో కాస్త చెప్పండి.

జ్యోతి : (పంచాంగం చూస్తూ) ధరలకు అధిపతి అంగారకుడైనాడు. అంగారకుడంటే అగ్నిహోత్రంలా మండించేవాడన్నమాట. ఒక్కొక్కప్పుడు వస్తువులు దొరక్క దేశంలో క్షామం కూడా రావచ్చు.

కాపిట : అయితే ఏ ఏ వస్తువులకు ధర పెరుగుతుందంటారు ?

జ్యోతి : మొత్తంమీద అన్నివస్తువులకూ ధరలు పై చూపులోనే ఉంటాయి. ముఖ్యంగా అపరాలు, ధాన్యాలు, పంచదార మొదలైన ఆహారపదార్థాలకు విపరీతంగా ధరలు పెరుగుతాయి.

కాపిట : వండర్ ఫుల్! వండర్ ఫుల్! నేను చేస్తున్నది కరెక్టన్న మాట. చూడండి? ధరలు పెరుగుతాయనే ఉద్దేశంలో

అపరాలన్నీ పెద్దపెట్టున నిల్వ ఉంచాను. పంచదారకూడా కొంత Stock చేశాను. ఆc! మనకు రెండు రైస్ మిల్సు, రెండు ఆయిల్ మిల్సు కూడా ఉన్నాయి. నూనెలకు ధర ఏలా ఉంటుందంటారు.

జ్యోతి : వేరుశనగ నూనె, నువ్వుల నూనె, మొదలైనవన్నీ ఆహారపదార్థాల్లో చేరినవే. కనుక అవి కూడా తప్పక పెరిగి తీరాలి.

కాపిట : పోతే గుడ్డలకు ధర ఏమైనా వస్తుందంటారా?

జ్యోతి : మీకు బట్టలవ్యాపారం లేదనుకుంటాను.

కాపిట : ఈమధ్య బట్టలమిల్లులో కొన్ని షేర్లు కొన్నానండీ. కంట్రోలు ధర కమ్మితే దమ్మిడీ లాభం రాదు.

జ్యోతి : (పంచాగం చూస్తూ) ఈ నెలాఖరువరకూ బట్టల ధర కొంచెం తగ్గుదలలోనే ఉంటుంది. కాని వెంటనే ఇంద్రుడు వక్రిస్తాడు. చంద్రుడు వెక్కిరిస్తాడు. రేట్లు ఒక్కసారిగా పైకి లేచిపోతయి. అసలు పాకిస్థాన్‌కూ మనకూ పడకుండా ఉంటే ప్రత్తి ఎలా లభ్యమౌతుంది. చెప్పండి?

కాపిట : బలేగా చెప్పారు. ఆc! నాకీ రోజు చాల సంతోషంగా ఉంది. సిద్ధాంతిగారూ! నా సందేహాలన్నీ చక్కగా తీర్చారు.

జ్యోతి : ఇందులో నా గొప్ప తనమే ముందండీ. రాజు శని కావటం, నాలుగు గ్రహాలు వక్రించడం. అయిదు గ్రహాలు ఒకే చోట కూడటం, యుద్ధం రావటానికీ, ధరలు పెరగటానికీ ఇంతకన్నా ఏం నిదర్శనాలు కావాలి?

కాపిట :, మీరు జ్యోతిషంలో చాల ప్రసిద్ధుల్లాగా ఉన్నారు.

జ్యోతి : నా ప్రజ్ఞ చాలమందికి తెలుసు. పెద్ద పెద్ద నాయకుల జాతకాలన్నీ నే నే చూస్తుంటాను. మొన్న మంత్రివర్గం మారినప్పుడు నేనే ముహూర్తం పెట్టింది.

కాపిట : అట్లాగా ! ఈ విషయం అందరికీ తెలిసేటట్లుగా పత్రికల్లో వేయిస్తాను. అది మీకు చాలా డబ్బు సంపాయించి పెడుతుంది.

జ్యోతి : చిత్తం చిత్తం. నా కిప్పుడు డబ్బు చాలా కావాల్సి వచ్చింది. తమతో చెప్పాను కదూ! మా అబ్బాయి పెండ్లి తలపెట్టానని. మీ రా కార్యాన్ని ఎలాగైనా గట్టెక్కేలాగా చూడాలి.

కాపిట : అవు నవును. తప్పకుండా. నే నిప్పుడు కొంచెం కాగితాలు చూసుకోవాల్సిన పనుంది. బండి ఎలాగూ గంట లేటుగా వస్తుంది. మీ రొక అరగంటలో వస్తే చెక్కు వ్రాసిస్తాను.

జ్యోతి : చిత్తం! చిత్తం! నేను మహారాజుల జాతకాలు తప్ప మామూలువాళ్ళవి చూడనండి. అసలు నూటపదహార్లు ఇవ్వంది పంచాంగం విప్పను.

కాపిట : నా జాతకాన్ని గురించి నిన్న చెప్పారు. మళ్ళీ ఏం చూడక్కర్లేదు కదూ !

జ్యోతి : మొదటే చెప్పాను కదండీ మీది మహారాజ జాతక మని. అందులో ఇప్పుడు యోగం పట్టింది.

కాపిట : అవయోగా లేమీ లేవు కదా ?

జ్యోతి : అన్నిరోగాలకూ మందు డబ్బు. అది బాగుంటే అన్నీ బాగున్నట్లే. యోగం, భోగం డబ్బుతోటే వస్తాయి. ఇప్పుడు మీకు శుక్ర మహార్దశ ప్రవేశించింది గోచారంలో బృహస్పతి పదకొండింట ఉన్నాడు. పైగా కేంద్రంలో రవి, కుజులు పొంచుకూర్చున్నారు. ఈ దశలో మీకు డబ్బు ప్రవాహంలాగా వస్తుంది.

కాపిట : మీరు చెప్పిన ఫలితాలు చాల Correct గా కన పడుతున్నాయి. అరగంటలో తప్పక రాండి. ఎంత కావాలో ఇచ్చి పంపుతాను.

జ్యోతి : చిత్తం. చిత్తం. (లేస్తాడు)

కాపిట : మంచిది. వెళ్ళిరాండి (జ్యోతిష్కుడు వెళ్ళిపోతాడు)

(కాపిటలిస్టు పైపుతీసి వెలిగిస్తూ ఉంటాడు. ప్రవేశం జర్నలిస్టు. వయస్సు 25 సంవత్సరాలు. సాధారణమైన సూటు, సన్నగా పొడుగ్గా ఉంటాడు. చేతిలో లెదరుబ్యాగు, కొన్ని పత్రికలూ ఉంటాయి. జర్నలిస్టు కుర్చీలో కూర్చుని పేపరు చూచుకుంటూ ఉంటాడు. కాపిటలిస్టు ఇతన్ని కొద్దిసేపు పరకాయించి చూస్తాడు. హఠాత్తుగా ఏదో గుర్తుకువచ్చినట్లు పలకరిస్తాడు)

కాపిట : ఓ ! విశ్వం గుర్తుపట్టలేకుండా అయినావేమోయి! ఎక్కణ్ణుంచి రావడం ?

జర్నలిస్టు : Excuse me. మీ రెవరో......

కాపిట : (ఆప్యాయంగా) మర్చిపోయినావోయ్? నేను B. M. శేఖర్‌ను. నీవు ఆడిటర్ రామారావుగారబ్బాయివి కదూ!

జర్న : (గుర్తుకురానట్లు ఆలోచిస్తూ ఉంటాడు)

కాపిట : ఇంకా జ్ఞాపకం రాలేదూ! మీ నాన్నగారి కోసం

నేను తరచు బందరు వస్తూండేవాణ్ణి. అప్పుడు నీవు చిన్న వాడివిలే, చదువుకుంటున్నావు.

జర్న : (గుర్తుకు వచ్చి) మీకు Business ఉందికదూ ?

కాపిట : (సంతోషం కనపరుస్తూ) ఆఁ ! ఆఁ ! జ్ఞాపకం వచ్చిందా ? రైస్ మిల్సు. ఇప్పుడు ఆయిల్ మిల్సుకూడా కొని Business బాగా 'ఇంప్రూవ్' చేసాను.

జర్న : ఓ ! అలాగా !

కాపిట : పాపం ! మీ నాన్న పోయారని విన్నాను.

జర్న : అవును. ఆయన పోవడంతో మా family చాలా troubles లో పడింది.

కాపిట : ఆయన ఎంతో మంచివాడు. నాతో చాల friendly గా ఉండేవాడు. మా ఆఫీసు అక్కౌంట్లన్నీ ఆయనే చూచేవారు.

జర్న : ఎలాంటివారైతేనేం ? ఈ రోజుల్లో ఎవరి బాధలు వారు పడాలికాని, ఇతర్లెవరు చూస్తారు.

కాపిట : ఇప్పుడు నువ్వేం చేస్తున్నావ్ ?

జర్న : ఈ మధ్యనే B.,Sc., పూర్తి చేశాను. ప్రస్తుతం ఒక పేపరు నడుపుతున్నాను.

కాపిట : పేపరా ? (ఆశ్చర్యంగా)

జర్న : ఏం ? అలా అడుగుతున్నారు ?

కాపిట : ఏమీ లేదు. ఈ రోజుల్లో పేపరు నడపాలంటే బోలెడు డబ్బు అవసరం. అందుకని దానికి ఏ కాపిటలిస్టు సపోర్టయినా ఉండాలి.

జన్ని : నా పేపరుకు అలాంటిదేమీ లేదు. నా పత్రికను ప్రజలకోసం పెట్టాను. ప్రజలే దాన్ని పోషిస్తారు. ప్రజలే దాన్ని ఆదరిస్తారు. ప్రజలయొక్క అచంచల విశ్వాసాన్ని కోల్పోనంతవరకూ అది నిర్విఘ్నంగా సాగుతుంది. ప్రజా జీవితాన్ని ప్రతిబింబింపజేసి వారి సుఖ సంపదలకు దోహద మివ్వడమే నా పత్రిక లక్ష్యం. అది ఏ పెట్టుబడిదారు క్రిందనూ బానిసగా లేదు.

కాపిటు : పొరపాటు. ధనవంతుల సహాయం లేందీ ఏ పత్రికా నడవలేదు. ఈ మాట నేను స్వానుభవంమీద చెప్తున్నాను. 'వ్యాపారి, హిందూ ధర్మం,' ఈ రెండు పత్రికలూ నా ఆధ్వర్యంక్రింద నే నడుస్తున్నాయి. పత్రికలు నడపటంలో గల కష్టసుఖాలు నాకు బాగా తెలుసు. ఇప్పుడు పత్రికలు అనేకం పుట్టగొడుగుల్లా పుట్టి, మర్రోజుకు మాయమౌతున్నయీ అంటే దానికి కారణం ధనికుల సపోర్టు లేకపోవటమే

జన్న : క్షమించండి. మీరు తప్పుగా మాట్లాడుతున్నారు. పత్రికలు నిలవకుండా పడిపోతున్నయంటే దానికి కారణం పెట్టుబడిదార్ల ఆదరణ లేక కాదు. వాటిపై ప్రజలకు విశ్వాసం లేక, అవి ప్రజా జీవితాల్ని సరిదిద్ది, ప్రజాహృదయాల్లో నవ చైతన్యాన్ని సృష్టించగలిగిన నాడు శాశ్వతంగా ఉండగలుగుతాయి.

కాపిటు : నీ ధోరణి చూస్తే నీవొక మార్క్సిస్టులాగ అవుపడుతున్నావే ?

జర్న : నేను ఏ ఇస్టునూ కాదు. ప్రజలకిష్టుణ్ణి. ప్రజల సౌఖ్యమే నా సౌఖ్యం. ప్రజల జీవితమే నా జీవితం.

కాపిట : నాక్ సెన్సు. ప్రజలూ, ప్రజలు. ఎంతసేపూ అదే మాట. అయితే డబ్బుకలవాళ్ళంతా ప్రజలు కారనేనా నీవనేది.

జర్న : మీరు సైలెంటుగా వింటే అర్థమౌతుంది. దేశంలో కోట్లమంది ప్రజలు తిండికీ, బట్టకూ లేకుండా మాడి పోతున్నారు. దీనికాకారణం పెట్టుబడిదార్లే. ధనికులు తమ స్వలాభం కోసం, దేశంలోయుద్ధాలనూ, అశాంతినీ రెచ్చ కొడుతూ, బ్లాకుమార్కెటు చేసి ధరలను పెంచి పదార్థా లను ప్రజలకు అందుబాట్లో లేకుండా చేస్తున్నారు. కనుక ధనికవర్గం ఉన్నంతవరకూ దేశంలో యుద్ధాలుపోవు. కరువు కాటకాలు నశించవు. (కోపంగా) ఈ బాపతు వాళ్ళను ప్రజలని చెప్పేదానికంటే ప్రజాహంతకులని చెప్పడం ఎంతో సమంజసం. నర రక్తం దాహం త్రాగే రాక్షసులని పిలవడం చాల ముచ్చటైనపదం.

కాపిట : అయితే నీవు Anti war propagandist వన్న మాట.

జర్న : అవును. యుద్ధాలు కావాలనేవాణ్ణి కాదు. యుద్ధాలు పోవాలనే వాణ్ణి. అందుకనే నా పత్రికకు “శాంతి” అని పేరు పెట్టాను. యుద్ధోన్మాదుల నెదుర్కొని విశ్వ శాంతిని స్థాపించడమే నా లక్ష్యం. ఇప్పుడు జరుగుతూ వున్న ప్రపంచ శాంతి మహాసభకు ప్రతినిధిగా వెళ్తున్నాను. మానవ శాంతికోసం మనసారా పనిచేస్తున్నాను.

కాపిట : (పెద్దగా) impossible, quite impossible శాంతీ! శాంతి! శాంతి కావాలనటం వట్టి భ్రాంతి. యుద్ధాలు ఈనాటివి కావు. అవి ప్రపంచంతో పాటు పుట్టినయ్. యుద్ధాలు చరిత్రకాధారం. యుద్ధాలు లేకపోతే మానవ సంస్కృతే నశిస్తుంది.

జర్న : అవును. యుద్ధం మిమ్మల్ని పెద్దవారినిగా చేసింది. మీకు కావలసినంత డబ్బునూ, అధికారాన్ని ఇచ్చింది. అందుకే యుద్ధం లేకపోతే మీకు మూడంతస్థుల మేడ లేవు. పట్టు పరుపులపై పండుకోవడం లేదు. యుద్ధం లేంది మీ ఆటలే సాగవు.

కాపిట : (బల్లపై కొట్టి) ఇస్. యుద్ధం తప్పకుండా వస్తుంది. మహా మారణాయుధాలతో మరో ప్రపంచ యుద్ధం వచ్చి తీరాలి.

జర్న : చస్తే యుద్ధం రావడానికి వీల్లేదు.

కాపిట : అహ ! హ ! హ ! అందరూ చచ్చింతర్వాత శాంతి తప్పకుండా వస్తుంది.

(ప్రవేశం మతప్రవక్త : వయస్సు 50 సంవత్సరాలు. కాషాయరంగు వస్త్రాలు. ముఖాన విభూతి రేఖలు. మెడకూ, చేతులకూ, చెవులకూ, రుద్రాక్ష లుంటాయి. పావుకోళ్ళు, చేతిలో జింక చర్మంతో తయారైన సంచి ఉంటాయి. అచ్చం హిందూమతోన్మాదిత్వం అతనిలో జీర్ణించిపోయి ఉన్నట్లుగా కనిపిస్తాడు.)

కాపిట : (లేచి నిల్చుని) నమస్కారం స్వామిజీ. రండి. రండి.

మత : "నమోనమః" (కూర్చుంటాడు) ఏదో తీవ్రంగా చర్చలు జరుపు తున్నారు.

కాపిట : కాస్త Discussions లో పడ్డాం లేండి. ఆఁ ! ఎప్పుడొచ్చారు ?

మత : ఈ బండికే వచ్చాను. మీకోసం ఆఫీసుకు వెళ్ళితే మీరూ ఊరు వెళ్ళున్నట్లు చెప్పారూ... (జర్నలిస్టు వైపు అనుమానంగా చూస్తాడు.)

కాపిట : అవును Business పనిమీద అర్జంటుగా వెళ్ళాల్సి వచ్చింది. చెప్పండి ఏమిటి విశేషాలు ?

మత : వచ్చే సోమవారం నాగపూర్‌లో "అఖిలభారత సనాతన ధర్మ పరిషత్తు" జరగబోతూ ఉంది.

కాపిట : ఓ ! ఈజిట్ ?

మత : మహాసభకు అధ్యక్షత వహించటానికి సభ్యులందరూ మీ పేరునే సూచించారు. మీరు తప్పక అంగీకరించాలి.

కాపిట : (పట్టరాని సంతోషంతో) ఓ; I am very glad. నాపై ఇంత గౌరవం చూపుతున్నందుకు సభ్యులందరికీ నా అభివందనాలు.

మత : అంతేకాదు. హిందూధర్మ చక్రవర్తి, ఉపన్యాస కేసరీ, మహోద్ధారకులూ, అయిన స్వామి పక్షీంద్రయోగినికూడా ఆహ్వానిస్తున్నాం. ఇంకా పెద్ద పెద్ద ఫిలాసఫర్సుకూ, మహోపన్యాసకులకూ, ప్రభుత్వాధికారులకూ, ఆహ్వానాలు పంపాం. దేశం నలుమూలలనుండీ దాదాపు నాలుగు వేలదాకా ప్రతినిధులు వస్తారని అంచనా.

కాపిట : వెరీగుడ్! వెరీగుడ్! హిందూధర్మం అడుగంటిపోతూ ఉన్న రోజుల్లో ఇలాంటి సభ లెంతైనా అవసరం.

మత : మహాసభలో హిందూకోడ్ బిల్లుకు వ్యతిరేకంగా మొదటి తీర్మానం చేయాలనుకుంటున్నారు.

కాపిట : మంచి పని చేస్తున్నారు. గట్టిగా నిరసనను తెలియ పర్చాలి. లేకపోతే దీంతో హిందూమతం పూర్తిగా అడుగంటిపోయినట్లే.

మత : అంతే కాదు. ఈ వచ్చే ట్రయిన్‌లో పెద్ద వాలంటీరు దళం వస్తూంది. పుష్పమాలలతో మిమ్మల్ని అలంకరించి పెద్ద ఊరేగింపు జరపడానికి నిశ్చయించారు.

కాపిట : (సంతోషంతో ఉప్పొంగుతూ) చాల సంతోషం. నన్నింతగా సన్మానించ బోతున్నందుకు మీ అందరికీ నా ధన్యవాదాలు.

మత : ఇన్ని సంవత్సరాలనుండీ దేశంలోని మత సంస్థల కొరకు పాటుపడుతున్న మిమ్మల్ని సన్మానించడం గొప్పవిషయం కాదు. మీరు దాని కన్నివిధాలా తగినవారు.

కాపిట : అది యథార్థమే అనుకోండి. అయినా పెద్దపని తల పెట్టారని. . .

మత : పెద్దమొత్తం ఖర్చవుతుందని అనుకుంటున్నాం. మీరు కూడా ధనసహాయం చేస్తేనేకాని ఈ కార్యం జయప్రదం కాదు.

కాపిట : ఓ ! తప్పకుండా. ఆ విషయంలో నే నెప్పుడూ వెనుకాడనని మీకు తెలుసుగా ! ఎంతకావాలో తీసుకోండి.

మత : ఎంతడిగినా ఇస్తారని నాకు తెలుసు. ఐశ్వర్య సంపన్నులు మీరు ఎంతైనా ఇవ్వవచ్చుకూడా !

కాపిట : (బ్యాగులోంచి చెక్కుబుక్కు తీసి వ్రాస్తూ) ఇదిగోండి రెండువేలకు చెక్కు వ్రాసిస్తాను. తర్వాత మరికొంత ఇస్తాను. (చెక్కు చేతికి ఇస్తాడు)

మత : (తీసుకుంటూ) భగవదార్పణం ! (కొన్ని కాగితాలు సంచిలోంచి తీసి) ఇవిగోండి కరపత్రాలు, కార్యక్రమాలు ఈ విధంగా ఏర్పాటు చేద్దామనుకున్నాం. (కాగితాలు అందిస్తాడు)

కాపిట : (తీసుకుని చూచి) బాగుంది. Neat గా అచ్చువేయించండి. కావల్సినంత పబ్లిసిటీ ఇవ్వండి.

మత : మీ రీ పూట మాకోసం ప్రయాణం ఆపుచేయాలి. వాలంటీర్ల కార్యక్రమమంతా ఈ పూట సరిపోతుంది.

కాపి : అలాగే. మీ పని పూర్తిచేసి మరీవెళ్తాను. (జర్నలిస్టుతో ఆఁ ! చూచావా మిస్టర్ ! ఇందాకటినుండీ దేశంలో ధనవంతులే ఉండకూడదన్నావ్. మా వల్ల ఎన్ని సంస్థలు పోషించబడుతున్నాయో చూచావా ? ధనికులు లేంది ఏ పనీ జరగదనుకో.

జర్న : అవును. ధనవంతులు లేంది మతోన్మాదుల్లేరు. దేశంలో దారిద్ర్యం లేదు. ఆకలిత్తో అల్లాడడం లేదు. ఇంతెందుకు? ధనికులు లేంది ప్రభుత్వమే లేదు.

మత : ఇతనెవరో అచ్చం కమ్యూనిస్టులా ఉన్నాడే.

జర్న : ఫాసిస్టునుమాత్రం కాదు.

కాపిట : రష్యా వెళ్తున్నాడు లేండి.

జర్న : దేశద్రోహులకూ, మత పిశాచాలకూ శిష్యత్వం చేయడం లేదు.

మత : My dear Friend ఆయ నెవరో తెలుసా ?

జర్న : కనపడుతూనే ఉంది. పెద్ద కాపిటలిస్టు, బ్లాకుమార్కె-టీరు, మిల్లులకు యజమాని. వేలమంది కార్మికుల ప్రాణాల్ని బొమ్మల్లాగా చేసి, తైతక్కలాడించే మహానాయకుడు, ప్రజల పొట్టలుకొట్టి ఇనపెట్టెలు నింపిన ధార్మికుడు ! అంతే కదూ !

కాపిట : (కోపంగా) మిస్టర్ విశ్వం ! చాలా Rash గా పోతున్నావ్. వళ్ళు తెలియకుండా మాట్లాడుతున్నావ్.

జర్న : ప్రజల కళ్ళు కప్పడం లేదు.

కాపిట : నిన్నేం చేయాల్సివస్తుందో తెలుసా ?

మత : వెంటనే రిపోర్టు చెయ్యండి. ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నాడనీ, ప్రజల్లో విద్రోహచర్యలు జరుపవలసిందిగా ప్రచారం చేస్తున్నాడనీ, Statement ఇవ్వండి.

జర్న : అహా ! హా ! హా: రిపోర్టా ! ఎందుకూ ? ప్రభుత్వానికి మీరు సపోర్టయినప్పుడు ఏమైనాచేయగలరు. నేను విద్రోహ చర్యలు జరుపు తున్నానా ? (పెద్దగా) సిసలైన కల్తీలేని దేశద్రోహులు మీరు. తిండి దొంగలూ, అభ్యుదయ నిరోధకులూ, యుద్ధప్రేరేపకులూ, అంతామీరే.

మత ; (గట్టిగా) మహాబయలుదేరాడు మొనగాడు, యుద్ధాలను ఆపుచేసేవాడూ, మానవుల్ని రక్షించేవాడూను దేవుడిలా మాట్లాడు తున్నావే. (గంభీరంగా) ఆయువు తీరిన ప్రతివాడూ చావవలసిందే, యుద్ధాలవల్లగానీ, మరి దేనివల్లనైనా కానీ; అసలు ప్రపంచంలో పాపం ఎక్కువై

పోయింది. జనాభా పెరిగిపోయింది దేవుడూ, దైవమూ, భక్తీ, వర్ణాశ్రమధర్మాలూ, అన్నీ నశించాయి. మతాలు మంటకలిశాయి. తిరిగీ నాలుగు పాదాలతో ధర్మం తల ఎత్తాలంటే యుద్ధాలు వచ్చి, ప్రళయంగా జనం నశించాలి. అప్పుడేగాని నూతన సృష్టి జరగదు. అప్పుడే కాని నిజమైన శాంతి....

జర్న : ఆపండి! మీలాంటి వెర్రి వేదాంతులుండబట్టే దేశంలో శాంతి లేకుండాపోయింది. జనమంతా చచ్చింతర్వాత ఎవరికోసం శాంతి? మీరు కోరేది మానవ శాంతి కాదు. శ్మశాన శాంతి.

మత : రేపో, మాపో, ధర్మశాస్త్ర ప్రకారం వీరభోగవసంత రాయలు అవతారం ఎత్తనున్నాడు. రేపు జరగబోయే మా ధర్మసభలో ఈ విషయాన్నిగూర్చి విపులంగా చెప్ప దలచాం.

కాపిట : స్వామిజీ ధర్మసూత్రాల్ని గ్రహించడంలో ఆరితేరిన దిట్ట.

మత : (ఉపన్యాస ధోరణిలో) అంతేకాదు. కలియుగంలో 5 వేల సంవత్సరాలు దాటింతర్వాత, లోకంలో ప్రళయం సంభవిస్తుందనీ, జనం కుప్పలు కుప్పలుగా నశిస్తారనీ, బ్రహ్మ పురాణంలో వ్రాసుంది. ఆ ప్రళయాని కర్థం బహుశా ఏ ఆటంబాంబో, హైడ్రోజన్ బాంబో అయిఉంటుంది. కనుక ప్రపంచానికి ముందు రాబోయ్యే రోజులు ఇంకా గడ్డుగా ఉంటాయన్నమాట. లోకమంతా ఒక యుద్ధభూమిగా మారుతుంది. హా! భగవదేచ్ఛను ఎవరడ్డ గలరు?

కాపిట : మిస్టర్ విశ్వం ! విన్నావా స్వామిరాజీ గీతోపన్యాసం.

జర్న : రాతలకోసం చేతులూ, అపైన గీతలూ చూడ్డం, మీకు పరిపాటి. నా కా గోతుల్లో పడాల్సిన అవసరంలేదు. అసలు అలాంటి వాటిపై నాకు నమ్మకమే లేదు.

కాపి : అయితే పురాణాలు అబద్ధమంటావా ?

జర్న : పుక్కిటి గాథలు. కేవలం అభూత కల్పనలు. లేకపోతే అవి మానవ అభ్యుదయానికి దోహద మివ్వాలికాని, మానవ మారణానికి ఎందుకు కారణం అవుతాయి?

కాపి : గ్రహాలూ, జ్యోతిషం యుద్ధాన్నే సూచిస్తున్నాయి. నీవు B., Sc. చదువుకున్నావుకదా ! Science ను కూడా కాదంటావా ?

మత : అనలేదు. ఎన్నటికీ అనలేదు. Astrology is the root of all Sciences. జ్యోతిషం సైన్సుకంతకూ మూలమైంది.

జర్న : ఖగోళంలో లక్షలాది గ్రహాలున్నాయి. ఇంకా కొత్తవి అనేకం 'రీసెర్చి' చేస్తున్నారు. వీటి ఉనికీ, స్వరూపం తెలుసుకోవడంగానీ, అవి ఎక్కణ్ణుంచి వస్తున్నవో, ఎటు పోతున్నవో పరిశీలించే జ్ఞానంగాని, ఏ సిద్ధాంతులకూ లేదు. నోటికి వచ్చినట్లు రాద్ధాంతాలు చేయడంతప్ప, జ్యోతిష్కులకు ఇంకేమీ తెలియదు.

కాపిట : ఈ వాదం మనకు తెగేది కాదు. అయినా నిన్ను మరొకటి అడగదలచాను; నా మిత్రులు కొందరు North India లో ఒక పెద్ద 'ఫ్యాక్టరీ' పెట్టటానికి సన్నాహాలు చేస్తున్నారు.

మత : ఏం 'ఫ్యాక్టరీ' అండోయ్ ? ఏదైనా కొత్త Business ప్రారంభిస్తున్నారా ఏమిటి ?

జర్న : బహుశా బాంబుల్ని తయారుచేసేదయి ఉంటుంది.

కాపిట : అందులో పనిచేయడానికి కొంతమంది Scientists, Efficient Graduates కావాలి ! నీవు వప్పుకుంటే సిఫార్సు చేస్తాను; కోరినంత డబ్బిస్తారు.

జర్న : అమెరికన్ పేపరులో ఒక అడ్వర్టైజుమెంటు పారే యండి. ఆ దేశపు సైంటిస్టులు బాంబుల్ని తయారు చేయ డంలో సిద్ధహస్తులు.

కాపిట : నీ వేదో చదువుకున్నవాడివి, తెలిసిన వాడివీ, అని అడిగాను. పత్రికలూ, శాంతి ప్రచారాలూ, ఈ బాధలు నీవు పడలేవు. ఎందుకొచ్చిన శ్రమ. నేను చెప్పి నీకు కావల్సినంత డబ్బిప్పిస్తాను. జీవితంలో ఏదో నాలుగు డబ్బులు సంపాయించే మార్గం చూడాలిగాని...

జర్న : సైన్సును మీరు నీచంగా అర్థం చేసుకుంటున్నారు. దానికి పెడర్థాలు చెప్పి మీ స్వార్థం కోసం ఉపయోగించుకుంటున్నారు. శాస్త్రం, లలితకళలు, ఇవి మానవ విజ్ఞానాన్ని పెంపొందింపచేసి మానవ జీవితాన్ని సౌఖ్యవంతంగా చేయాలిగాని, మానవ నాశనానికి హేతువు కాకూడదు. ఇక ఎప్పుడూ ఇలాంటి విషయాలు నాతో చెప్పకండి.

కాపిట : అయితే దరిద్రంతో బాధపడ్డం నీ కిష్టమన్నమాట.

మత : డబ్బిప్పిస్తానంటే చేదయిందా ?

జర్న : (ఉద్రేకంగా) నా తత్వం మీకింకా అర్థం కాలేదు.

నన్ను వంచించాలని చూడకండి. నా ఆదర్శాలను మీ బానిసలుగా చేసుకోటానికి ప్రయత్నించకండి. నీచమైన పని చేసి డబ్బు సంపాయించడం నామతం కాదు. ఎన్ని ఇబ్బందులు పడైనా ప్రజాసేవ చేయడమే నా లక్ష్యం. మరో యుద్ధంకోసం మారణాయుధాలు తయారుచేసే మిమ్మల్ని ఏమనాలో తెలియడంలేదు. ఆటం బాంబులు వేసి మానవ శాంతిని భగ్నపరచాలనుకునే మీరు, ఏ శిక్ష విధింపబడ్డానికి అర్హులో అర్థం కావడంలేదు. (బయటినుండి అహా ! హా ! హా నవ్వులు వినపడతయి. సోల్జెరు ప్రవేశిస్తాడు. వయస్సు 30. గత యుద్ధంలో పనిచేసి కన్ను, కాలు, పోగొట్టుకున్నాడు. మాసిన కాకీనిక్కరు, మాసికలు వేసిన కాకీచొక్కాతో ఉంటాడు. చూడ్డానికి భయంకరంగా ఉంటాడు. శరీరంమీద అక్కడక్కడ గాయాలు ఉంటాయి. బలమైన శరీరమే అయినా తిండి లేక చిక్కిపోయి వుంటాడు.)

సోల్జె : అహా హా ! హా ! (నవ్వు)

కాపిట ; ఏయ్ ! ఎవరు నీవు ?

సోల్జె : అహా ! హా ! హా ! (నవ్వు)

మత : ఏమిటా నవ్వు.

సోల్జె : ఏమీ లేదు. ప్లాటుఫారంమీద ఎవరో యుద్ధం యుద్ధం అంటున్నారు. ఇక్కడ మీరూ యుద్ధాలనుగురించి చర్చిస్తున్నారు.

కాపిట : ఏమనుకుంటున్నారు ? మూడవ యుద్ధం వస్తుందని అంటున్నారా ?

జర్న : (వెగటుగా) "లేదు, లేదు. యుద్ధాలు ఆగిపోతాయి" అని ఉంటారు.

కాపిట : Never, Never, కొరియా యుద్ధమే Third war గా మారి ఉంటుంది.

జర్న : అబద్ధం ! అంతా అబద్ధం !

సోల్జె : ఏమండీ ! బాబుగారూ ! మరో యుద్ధం వస్తుందంటే మీా కెందుకంత సంతోషం ?

మత : "జనవాక్యం తు కర్తవ్యం" లోకమంతా అనుకుంటున్నది గనుక.

కాపిట : నిజంగా అంతే.

సోల్జె : ఇందాకటినుంచీ వింటున్నాను మీా ధోరణి. ఇంకా యుద్ధాలు కావాలని కోరుతున్నారా ?

కాపిట : ఏయ్ ! ఎవరు నీవు ? ఎందుకొచ్చావు ?

జర్న : యుద్ధాలకు వ్యతిరేకి అయి ఉంటాడు.

సోల్జె : నేనా ! నేను గత యుద్ధంలో ఒక సోల్జెర్ని.

జర్న : Poor fellow, యుద్ధంలోనే కన్నూ, కాలూ, పోయింది కాబోలు.

కాపి : అయితే యుద్ధాల సంగతి నీకు బాగా తెలిసి ఉంటుంది.

సోల్జె : బాబూ ! మీాకు పుణ్యం ఉంటుంది ఆ పాడు యుద్ధాల మాట ఎత్తకండి. నా గుండెల్లో దడ పుడుతుంది.

జర్న : ఏం ? యుద్ధంలో పనిచేసిన వీరుడివి కదూ !

సోల్జె : నా ధైర్యం, శౌర్యం, అన్నీ యుద్ధదేవత కప్పచెప్పాను. ఇప్పుడు భీరువులా తిరుగుతున్నాను.

కాపిట : మరో యుద్ధం వస్తే గవర్నమెంటు నిన్ను తప్పక తీసుకుంటుంది.

సోల్జె: (ఉద్రేకముగా) అవును. మరో యుద్ధం వస్తే, మీమేడపైన మరి నాలుగు గోడలు లేస్తవి. మరికొన్ని కొత్తరకం బాంబుల్ని తయారు చేయిస్తే రూపాయలతో కోటలు కట్టొచ్చు.

మత : ఏయ్ fool! ఏమి టాకేకలు.

సోల్జె : Rule చేసే వాళ్ళు నిజంగా ఫూల్స్!

కాపి : యు బెగ్గర్! గెటౌట్ ఫస్టు!

సోల్జె : నీకూ, నాకూ చాలదగ్గర సంబంధం వుంది. ఎందుకంటే నీకోసం నేను పుట్టాను కనుక.

కాపి : ఏయ్ స్టుపిడ్! ఇది ఫస్టుక్లాసు వెయిటింగ్ రూం.

సోల్జె : నా క్లాసు రిజర్వుడు. ఇందులోకి మరే క్లాసూ చేరదు.

మత : నిన్ను బయటికి గెంటిచాల్సి వస్తుంది.

జర్న : ఏం? అతనిమీద విరుచుకు పడతారు? ఇంతసేపూ యుద్ధాల్ని గురించి ఉపన్యాసం దంచారుగా! అతన్ని డగండి చెప్తాడు యుద్ధంయొక్క మంచి చెడ్డలు. యుద్ధరంగం ఎలా ఉంటుందో చెప్పటాని కతడు ప్రత్యక్ష నిదర్శనం. అతని ప్రతి అవయవం, యుద్ధంయొక్క ప్రతిఫలాన్ని అనుభవించిందే.

కాపి : your's is quite wrong మిలిటరీవాళ్ళకు ఎన్నో సదుపాయాలున్నాయి. Free clothing, Free medical aid. ఇక తిండి విషయంలో కావల్సినంత పెడతారు. ఇవికాక బిరుదులు, సర్వీసు అయింతర్వాత "పెన్షను" ఇంకా...

మత: మిలటరీవాళ్ళకు Prostitutes ను కూడా సప్లయిచేస్తారు.

సోల్జర్ : (గంభీరంగా) ఆగండి! పచ్చని పైరులనో, చక్కని స్త్రీలనో, నవ్వే బిడ్డలనో, ఎర్రని రక్తం పొంగే యువకులనో, కళకళలాడుతూ ఉండే భూదేవిని శ్మశానంగా మార్చాలని చూస్తున్నారా? మీరు మనుషులేనా? మీలో మానవత్వం ఉందా? మీకు హృదయం లేదూ? (క్షణం నిశ్శబ్దం. సోల్జరు తలవంచుకుంటాడు. శరీరం గగుర్పొడుస్తుంది. నేత్రాలు అశ్రుపూరితము లౌతాయి. గద్గద స్వరంతో) గత యుద్ధంలో రిక్రూటింగ్ ఆఫీసర్లు మా ఊరికి వచ్చి యుద్ధంలో చేరిన వారికి అనేక సదుపాయాలుంటాయి. తిండీ, బట్టా ఒకటేమిటి? వారి కుటుంబాన్ని యావత్తూ ప్రభుత్వం సర్వ విధాలా రక్షిస్తుందని ఉపన్యాసాలిస్తుంటే నేనూ, నిజమేనని భ్రమపడ్డాను. లేవలేని ముసలి తల్లినీ, తిండికి అవస్థపడే భార్యనూ, వదలేసి మిలిటరీలో చేరాను. ఉపన్యాసాల్లో నేను విన్నది ఒక్కటీ నా కక్కడ కనిపించలేదు. ఒక్కొక్కపూట రొట్టె తినాల్సి వచ్చేది. కొన్ని రోజులు తిండే లేదు. నిద్ర ఎటువంటిదో ఎరగను. నా తల్లి మరణావస్థలోగూడా ఇంటికి వెళ్ళడానికి నాకు సెలవు దొరకలేదు. రాను రాను నా జీవితం దుర్భరమై పోయింది. త్రాచుల్లాగా నాలుకలు చాచి, అగ్నిజ్వాలలు కక్కే ఆ భయంకర మారణాయుధాల మంటలముందు తాళలేకపోయ్యాను. ప్రాణంపోయినా బాగుండేది. అలాకాక కన్నూ, కాలు, పోయి, ఈ భయంకర రూపంతో బయటపడ్డా. నేను ఇంటికి వెళ్ళేసరికి నా తల్లి మరణించింది. చేసుకున్న భార్య నాకోసం చూచి, చూచి, చివరకు ఎవడితోనో లేచిపోయింది.

ఇప్పుడు నా ఎముకల్లో మాంసం లేదు. నా నరాల్లో రక్తం ఏనాడో ఎండిపోయింది. నా శక్తి యావత్తూ యుద్ధరాక్షసికి బలిపెట్టి, శల్యాలతో ఇవతలికొచ్చాను. కడుపుకు తిండిలేక, కట్ట బట్ట లేక, చివరకు నా అని చెప్పుకోదగ్గ వాళ్ళెవరూ లేక తిరుగుతున్నా. నేనొక జీవచ్ఛవాన్ని [ఏడుస్తాడు]

జర్న : ప్రభుత్వం నీకు డబ్బుగానీ, భూమికానీ, ఇవ్వలేదా ?

సోల్జెరు : నెలకు పదిరూపాయ లొస్తయన్నారు. దరఖాస్తు పెట్టుకుంటే ఎకరం భూమికూడా ఇస్తారన్నారు. చివరకు మా ఊరి గ్రామపెద్దలు నేను దేశద్రోహిననీ, ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తున్నాననీ, కనుక ఎలాంటి ప్రతిఫలం పొందటానికీ అర్హత లేని వాణ్ణనీ, సర్టిఫికెట్లు వ్రాసి రిపోర్టులు పంపారు. అయిదేండ్లు యుద్ధంలో జీవితాన్ని ధారపోసినందుకు నేను దేశద్రోహి నయ్యాను.

కాపి : Selfishness ; అంతా Selfishness; సోల్జెరుకుండవలసిన గుణం త్యాగం. అలా కాకుండా నీవు స్వార్థంతో మాట్లాడుతున్నావు. కొన్ని లక్షల మంది యుద్ధంలో మరణించారు. కొన్ని వేలమంది అంగవిహీనులయ్యారు. అది పరిపాటి; అందులో ఆశ్చర్యపడాల్సిం దేమీ లేదు. అంతమాత్రంచేత యుద్ధాలను గురించి చెడుగా చెప్పడం, ప్రభుత్వాన్ని విమర్శించడం సరికాదు.

మత : యుద్ధంలో మరణించినవారు సరాసరి స్వర్గానికి వెళ్తారని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

సోల్జె : నీ వెప్పుడైనా స్వర్గాన్ని చూచావా?

మత : అటువంటి భాగ్యం నాకింకా భగవంతుడు ప్రసాదించ లేదు.

సోల్జె : అయితే ఒకమాటు కోరియా వెళ్ళి రండి. అక్కడ మీకు సాక్షాత్తు స్వర్గం కనపడుతుంది!

జర్న : గత యుద్ధంలో ఆటంబాంబు పడ్డప్పుడు "హీరోషిమా"లో ఉంటే మీకు తెలిసేది యుద్ధంలో స్వర్గముందో, నరక ముందో.

సోల్జె : ప్రపంచ సంగ్రామాలు రెండు గడిచిపోయినవి. వాటి వల్ల మనం తెలుసుకున్న దేమిటి? ఎవరో సామ్రాజ్య వాదుల స్వార్థంకోసం, నియంతల దురంతాల్లో అమాయకు లైన మానవులు అసంఖ్యాకంగా బలిచేయ బడ్డారు. పంట భూములు భస్మమై, కరువుకాటకాలు దశదిశలా లాస్యం చేసినవి. (పెద్దగా) అసలీ పాడు యుద్ధాలు ఎవరు కావా లన్నారు? ఎవరికోసం చేస్తున్నారు? ఆకలితో అల్లాడే ప్రజలకు కావాల్సింది ఆహారంకాని, ఆటం బాంబులు కావు. కట్టుకోడానికి బట్టకావాలి, కాని కదన భూమికాదు. ఉండడానికి ఇల్లు కావాలిగాని మిలటరీ డ్రిల్లుకాదు. ఇంకా ఇలాంటి దారుణాలు కావాలనే మిమ్మల్ని ఏం చేయాలో అర్థం కావడంలేదు. కాదు. మీరందరూ త్వరగా నశించాలి. వీల్లేదు. మరో ప్రపంచయుద్ధం రావడానికి వీల్లేదు. శాంతే రావాలి; శాంతి వచ్చి తీరుతుంది. [హఠాత్తుగా మేనేజరు ప్రవే శిస్తాడు. వయస్సు 35 సం॥ కోటు; నెత్తినటోపి, ఆఫీసు దుస్తులతో ఆదుర్దాగా వస్తాడు.]

మేనే : [కాపిటలిస్టుతో] సార్ !

కాపి : What? మేనేజరా?

మేనే : అవును సార్! మీతో......

కాపి : ఇక్కడ కెందు కొచ్చారు?

మేనే : మీ రొకసారి ఆఫీసుకు రావాలి. చాల Urgent!

కాపి : [కొంచెం భయం, ఆదుర్దా,] ఏమిటది? ఏమిటి చెప్పు?

మేనే : మీరు కొంచెం అవతలికి రావాలి సార్?

కాపి : అబ్బ! చెప్పవోయ్! ఏం ఫరవాలేదు.

మేనే : [జేబులోంచి నాలుగు టెలిగ్రాంలు తీసి చేతికిస్తాడు]

కాపి : ఏమిటిది? ఇన్ని వైర్లు ఎక్కణ్ణుంచి వచ్చినయ్?

మేనే : ఒకటి బొంబాయినుండి, ఒకటి కలకత్తా నుండి, మరొకటి ఢిల్లీనుండి వచ్చాయి. ఆ నాలుగోది బొంబాయి లోని మన ఏజంట్లు ఇచ్చారు.

కాపి : [టెలిగ్రాంలు చూస్తూ] ఆఁ! ఏమి టీ కొంపమన్ను?

మేనే : అవునుసార్! ధరలన్నీ తగ్గిపోయినవి. ప్రతిమార్కెట్టు సగానికి సగం పడిపోయింది.

కాపి : (శరీరం వణుకుతుంటుంది; ముఖం నల్లగా మారుతుంటుంది. తడబడే గొంతుకతో) Horrible, Horrible, ఇంత Down అవటా నికి కారణం?

మేనే : ఏముంది? కొరియా యుద్ధం ఆగిపోయింది.

కాపి : ఆఁ!

మేనే : అవును సార్! ఇప్పుడే రేడియో వార్త. కొరియా రంగంలో రాజీ సంభాషణలు ప్రారంభమైనాయి. మీరు కొరియా యుద్ధం ప్రపంచ యుద్ధమవుతుందని భ్రమపడ్డారు.

ప్రస్తుతం అలాంటిదేమీ లేక, రాజీ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇక పాకిస్తాన్ విషయంలో వట్టి ఆర్భాటమే తప్ప యుద్ధం చేసే సూచనలేమీ లేవని ఢిల్లీ వార్త.

కాపి : అబద్ధం! వీల్లేదు. యుద్ధం ఆగిపోవడానికి వీల్లేదు.

మేనే: నిజంగానండి; మనకు రెండు మూడు Telephone Calls కూడా వచ్చాయి. ఈ 'రూమరు' నిన్నటినుండే బొంబాయి మార్కెట్టులో ఉందట. ధరలన్నీ ఒక్కసారిDown చేశారు.

కాపి : (కొంచెం తూలుతూ, పైకిచూస్తూ) అబ్బ! ఎంత నష్టం!

మేనే : చెప్తే విన్నారా సార్! వద్దన్నకొద్దీ స్పెక్యులేషను చేసి బోలెడు సరుకు నిల్వచేశారు.

కాపి : (భయంకరమైన ముఖంపెట్టి నిలబడిఉంటాడు.)

మేనే : [దగ్గరగా వచ్చి] మార్కెట్టంతా గోలగా ఉంది సార్! ఎక్కడ విన్నా ఇదే వార్త. వర్తకుల ముఖాల్లో నెత్తురు చుక్కల్లేవు. కొందరు నిలుచున్నవాళ్లు నిలుచున్నట్లే పడిపోయారు. ఎంత చెప్పినా మీరు విన్నారు కాదండీ! జోస్యాలు, పేపర్లు చూచి, World War వస్తుందనీ, ధరలు మండిపోతాయని ప్రతి వస్తువూ మితిమీరి కొనిపించారు.

(ఇంతలో కొంచెం దూరంనుండి Trains రావడం, పోవడం, ధ్వనులు వినపడుతుంటాయి. B. M. శేఖర్ జిందాబాద్! B. M. శేఖర్ జిందాబాద్! సనాతనధర్మం వర్ధిల్లాలి! స్వామీ పక్షీంద్రులకు జై! అని నినాదాలు వినిపిస్తాయి. ఆ సందడి రాను రాను దగ్గరకు వస్తున్నట్లు వినిపిస్తుంటుంది.)

మత : (గాభరాతో) సార్!మన వాలంటీరు దళం వస్తూ ఉందండి. మనం త్వరగా వెళ్ళాలి.

కాపి : వాలంటీర్లు వస్తున్నారా? నన్ను సన్మానించడానికి, నన్ను గౌరవించడానికి.

(తిరిగీ కోలాహలం వినపడుతుంది. సనాతన ధర్మసంరక్షకులు B. M శేఖర్ జిందాబాద్! హిందూధర్మం వర్ధిల్లాలి!)

మత : అదిగోండి; కోలాహలం! చాల ఉత్సాహంతో మీరు అధ్యక్షు లయినందుకు గుర్తుగా పూలమాలలు వేయ డానికి వస్తున్నారండి! ఇంక మనకు టైము లేదు. వెంటనే ఎదురు వెళ్ళాలి!

కాపి : నన్ను అధ్యక్షునిగా ఎన్నుకున్నారా! నాకు పూల మాలలు వేస్తారా! అబ్బ! ఎంత నష్టం.

మేనే : Sir, Sir, మీరొకసారి వెంటనే ఆఫీసుకు రావాలి. అక్కడంతా గగ్గోలుగా ఉంది. ఏం చేయాలో ఎవరికీ తోచడంలేదు. పలకరేం సార్! అలా నిల్చుంటారేం సార్!

కాపిట : (పెద్దగా కేకపెట్టి క్రింద పడిపోతాడు)

మేనే : అరె! అదేమిటి సార్! పడిపోయినారేమిటి?

మత : (దగ్గరకువచ్చి చూస్తాడు) అరె! స్పృహ లేనట్లుందే! ఏమిటీ అన్యాయం?

మేనే : అరె! వళ్ళంతా చల్లగా ఉందండీ! ఇలా కొయ్యబారిపోతూందేమిటి? ఉండండి సార్! డాక్టర్ని పిలుచుకొస్తాను. (పరుగెత్తుతాడు)

జర్న : పాపం Heart Fail అయి ఉంటుంది.

సోల్జెరు : కాదు కాదు. గుండె ఆగిపోయి చచ్చాడు.

మత : ఏమిటా మాటలు అశుభంగాను. శేఖర్ గారు మళ్ళీ కోలుకోవచ్చు. "స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం న్యాయేన మార్గేణ మహీం మహీశాః" రాజరాజేశ్వరీ! ఇష్టకామేశ్వరీ! దివ్యత్రిపురేశ్వరీ! రక్షంతు ప్రాణం"
(మంత్రాలు చదువుతాడు)

జర్న : చచ్చినవాడికోసం మంత్రాలు చదివితే బ్రతుకుతాడయ్యా!

మత : ఉండండి! మీకు తెలియదు (తిరిగి మంత్రాలు చదువుతాడు)
(ఇంతలో జ్యోతిష్కుడు ప్రవేశించి ఏమీ అర్థంకానట్లు చూస్తాడు.)

జర్న : మీరేనా శేఖర్ గారికి జాతకం చెప్పింది.

జ్యోతి : అవునండి! ఏం? ఏం జరిగిందీ?

మత : ఉండవయ్యా! ఇక్కడ చాల ప్రమాద పరిస్థితుల్లో ఉంటే...

జ్యోతి : (దగ్గరకి వెళ్ళి చూస్తాడు. ఇక లాభంలేదని తెలుసుకుని) అరె! చాలా అన్యాయం జరిగిందండీ! ఇక నా డబ్బు లాగా? ఈయన నాకు చాలా డబ్బివ్వాలండీ!

మత : (కోపంగా) చాల్లేవయ్యా! డబ్బట! డబ్బు! ఏ ముఖం పెట్టుకొని అడుగుతున్నావు? ఇక్కడ మనిషికి ప్రాణాపాయం జరిగితే...

జ్యోతి : అవునండీ! నాకు ముందే తెలుసు ఈయన ఆయుర్దాయం పూర్తి అయిందని. అయినా ఏదైనా ఒక మంచి గ్రహం రక్షించకపోతుందా అనుకున్నా.
(తిరిగి బయట నినాదాలు వినపడతాయి.)

మత : (గాభరాగాలేచి) అరె! వాలంటీర్లు రానే వచ్చేశారు.

ఈయన ప్రాణం పోయినట్లే ఉన్నది చూడబోతే

(వెళ్లిపోతుంటాడు. జ్యోతిష్కుడు ఆయనవెంట బడుతూ)

జ్యోతి : ఇవ్వాళ నక్షత్రం ప్రకారం మీరే మహాసభకు అధ్యక్షులౌతారు. చూడండి, శేఖరుగారు మీకు డబ్బు ఇచ్చి ఉంటాడు. అందులో నాకు కొంత ఇవ్వండి (ఇద్దరూ వెళ్ళిపోతారు. జర్నలిస్టు, సోల్జరూ వికటంగా నవ్వుతారు)

జర్న : ఏనాటికైనా దేశంలోని యుద్ధోన్మాదులందరికీ ఇలాంటి గతి పట్టాల్సిందే.

సోల్జె : ఇది పగతో మండుతున్న మానవులు పెట్టిన శాపం! దీనికి తిరుగులేదు.

(తెర)



కాలం : రెండో ప్రపంచయుద్ధం ఆగిపోయిన కొద్ది కాలానికి

ప్రదేశం : రెండో ప్రపంచయుద్ధంలో పాల్గొన్న దేశాల్లో
ఎదో ఒక దేశంలో ఒక ప్రాంతం

పా త్ర లు :

మానసరావు

వసుమతి (భార్య)

ఆశ (కూతురు)

అతడు

Note : ఈ నాటిక విదేశాల్లో జరిగినట్లు చూపించాను. యుద్ధంవల్ల దెబ్బతిన్న ప్రాంతంలో నాటికను నడిపితే కథావస్తువుకు ఎక్కువ బలం చేకూరుతుందని అలా చేశాను. అయితే ఒకటి గుర్తుంచుకోవాలి. కరువులూ, ఆకలిచావులూ, మన దేశంలో కూడ విపరీతమై పోయినవి. స్వరాజ్యం వచ్చిం తర్వాత గూడ ఆకలివల్ల మనుషులు చావటం చాల తేలికయిపోయింది. నిన్న మొన్న రాయలసీమలో భయంకరమైన కరువు, ఆకలి చావులు, మన కళ్ళతో చూశాం. ఇలాంటి అమానుషాన్ని ఆపలేని ప్రభుత్వం సిగ్గు పడాల్సి ఉంటుంది. కనుక ఈ నాటిక మన దేశంలో జరిగినట్లుగా చూపించినా బాధలేదు.

మరోవిషయం. ఈ నాటిక కొంతభాగం చీకట్లో జరుగుతుంది. కనుక స్టేజీ యావత్తు చీకటిగా చేసి Spot Lights వెలుతురులో పాత్రలు కనపడేలా చేయాల్సి ఉంటుంది. Spot Lights దొరకడం సాధ్యపడకపోతే స్టేజీమీద బల్బులను Dim చేసి ప్రదర్శనం జరపవచ్చు.

# ఆ క లి

(రెండో ప్రపంచయుద్ధం ఆగి పోయింతర్వాత కొద్ది కాలానికి. ఆ యుద్ధంలో పాల్గొన్న జర్మనీ, జపాన్, ఇటలీ, ఇంగ్లండు మొదలైన దేశాల్లో ఏదో ఒక దేశంలో ఒక పల్లె ప్రాంతం. యుద్ధకాలంలో అక్కడ బాంబులు పడ్డవి. ఆ తర్వాత అక్కడే క్షామం కూడా వచ్చింది. తిండి, నీరు కూడా దొరకనందున చాలమంది జనం చచ్చిపోయారు. కొంతమంది అక్కణ్ణించి లేచిపోయారు. ఆ ప్రాంతంలో ఎక్కువభాగం నిర్మానుష్యంగా ఉంటుంది. నల్లగా బొగ్గులా మాడిపోయిన చెట్లు, కూలిపోయిన ఇండ్లు, నేలంతా బీటలువారి అక్కడక్కడ నల్లగా కరుడు కట్టిన రక్తంతో, ఎముకల గూళ్ళతో, బొమికల సమూహంతో నిండి వుంటుంది. అప్పుడే ప్రొద్దు గ్రుంకింది. అప్పుడప్పుడు నక్కల అరుపులు వినిపిస్తూ ఉంటాయి. తెర లేచే సరికి వసుమతి : వయస్సు 25 సంవత్సరాలకు మించదు. బాగా చిరిగిపోయిన చీరె, విదేశీయుల పద్ధతిలో కట్టుకొని ఉంటుంది. ముఖం పాలిపోయి ముడతలు పడి 50 సంవత్సరాల మనిషిలా అగుపిస్తుంది. శోష వచ్చి పడుకొని ఉంటుంది. ప్రక్కనే ఆశ కూర్చుని ఉంటుంది. వయస్సు 8 సంవత్సరాలు. చిరిగిన గౌను, రేగిన జుట్టు, ఎండిపోయిన డొక్కలు ఎగరవేస్తూ అప్పుడప్పుడు తల్లి చీరకొంగు లాగుతుంటుంది.)

ఆశ : అమ్మా! ఆకలి!.....ఆకలవుతుందమ్మా (క్షణం నిశ్శబ్దం) అమ్మా! అమ్మా! ఎంత సేపటికీ పలకవేవమ్మా! (క్షణం నిశ్శబ్దం. తల్లి పలకనందున తిరిగీ గట్టిగా పిలుస్తుంది.) అమ్మా! ఆకలమ్మా! ఆకలి! అమ్మా! లే అమ్మా!

(తల్లి ఎంతకూ లేవనందున 'ఆశ' గుండె పగిలినట్లు ఏడుస్తుంది. వసుమతి ఎక్కణ్ణుంచో ప్రాణాలు వచ్చినట్లుగా మెల్లగా లేచి కూర్చుని 'ఆశ'ను దగ్గరికి తీసుకుంటుంది.)

వసు : ఏం తల్లీ ? ఏడుస్తున్నావా ?

ఆశ : (ఇంకా ఏడుస్తూనే ఉంటుంది.)

వసు : (చెంపలు నిమురుతూ) ఎందుకు ? చెప్పమ్మా !

ఆశ : ఎన్నిసార్లు చెప్పాలి. ఊఁ ఊఁ ఊఁ (మూలుగుతూ) నా కాకలవుతూంది.

వసు : అయ్యో ! ప్రొద్దు కూకినట్లుందే. ఇంకా నాన్న రాలేదూ?

ఆశ : ఏడీ నాన్న ? ఎప్పుడో చెప్పావు నాన్నొస్తాడని. ఏడీ ! ఎక్కడున్నాడు ! పాడు నాన్న ! అబ్బా ! కాసిని మంచి నీళ్ళు ఇవ్వవే.

వసు : (ఆశవైపు అదోమాదిరిగా చూస్తుంది. కొంచెం దూరంలో ఉన్న సీసాను అందుకుంటుంది. బిరడా తీసి ఆశ చేతికిస్తూ) కొద్దిగా తాగి నాకో చుక్క ఉంచమ్మా ?

ఆశ : (ఆదుర్దాగా సీసాను నోటిదగ్గర పెట్టుకుటుంది. నీళ్ళురానందున రెండు చేతుల్తో సీసాను సాంతంగా పైకెత్తుతుంది.) ఛీ! సీసాను విసిరి కొడుతుంది. సీసా కొంచెం దూరంలో పడి ముక్కలయిపోతుంది. వసుమతి నిర్ఘాంతపోయి భయంతో చూస్తూంటుంది. ఒక్క క్షణం నిశ్శబ్దం. ఆశ కోపంవల్ల గలిగిన దుఃఖంతో వెక్కి వెక్కి ఏడుస్తుంటుంది.)

వసు : (ఆశను దగ్గరికి తీసుకుంటూ) ఏడవకమ్మా! ఏడవకు ! నీళ్ళయిపోయినయి కాబోలు. మర్చిపోయినా, పాపిష్టిదాన్ని. (కూతుర్ని బుజ్జగిస్తుంది)

ఆశ : (నీరసంగా) అమ్మా ! నేను బ్రతకనమ్మా !

వసు : ఛీ ! తప్పు ! అలా అనకూడదు తల్లీ. ఏం చెయ్యను, మన గతి ఇలా పట్టింది. గుక్కెడు మంచినీళ్ళకూడా నోచుకోలేదు. కడుపారా నిన్ను కన్నానే కాని, పట్టెడు మెతుకులు పెట్టే భాగ్యం లేక పోయింది. ఈ పాడు

యుద్ధం, ఈ పాడు కరువూ, ఏమంటూ వచ్చాయో! గంటెడు గంజికూడా తాగేప్రాప్తం లేకపోయిందమ్మా. ఏంతల్లీ! బాగా దప్పిక అవుతూందా?

ఆశ: ఏమోనమ్మా నాకేం తెలియటంలేదు. ఆకలో, దప్పికో, ఏమిటో? నా ఒళ్ళంతా తిరుగుతూ ఉందమ్మా! నీవు నా కళ్ళకిప్పుడు ఎక్కడో ఉన్నట్లు కనిపిస్తున్నావు.

వసు: అయ్యో నా ఆశ! నా చిట్టితల్లీ! ఏం చేయనమ్మా! నీవు చాల నీరసంగా వున్నావు. (లేచి నిలుచుని నాలుగు దిక్కులూ చూస్తుంది) గాఢాంధకారం. ఏమీ కనిపించడంలేదు. (పిచ్చిదానిలా అటూ, ఇటూ తిరుగుతూ) దాపులో ఒక్క చెట్టు గాని, చుక్క నీరుగానీ లేదని మీనాన్న చెప్పాడు. Pause. ఇంతవరకూ రాలేదు. ఏమైపోయినాడో ఏమో?

ఆశ: ఇంకా ఎన్ని రోజులమ్మా ఈ కష్టాలు?

వసు: ఎద్దైనా పట్నానికి వెళ్ళి పోదావమ్మా! ఏదీ రెండు రోజుల్నుంచీ అన్నం లేకుండా నడుస్తున్నాం. నడిచినంత దూరం కాయ, కసురు, కనుపించ లేదు. గుక్కెడు నీళ్ళు కూడా దొరకలేదు. ఈ రాత్రి అయినా ఎలా గడుస్తుందో తల్లీ! (దూరంనుంచి మనిషి వస్తున్నట్లు చప్పుడు వినిపిస్తుంది. వసుమతి అలాగే ఒక్క క్షణం నిలుచుని వింటుంది.) అదిగో! చప్పుడవుతూ ఉంది. మీ నాన్నే అయిఉంటాడు. ఇంకొక్క క్షణం ఆయన రాకపోతే మన మీ చీకట్లో ఏమైపోతామో తల్లీ!

ఆశ: చీకట్లో పెద్ద పులులు వస్తాయంటారు కదూ! ఏదైనా పులివచ్చి నన్ను మింగేస్తే బాగుండమ్మా!

వసు : (బిగ్గరగా) ఆశా ! (పరుగెత్తుకుంటూ వెళ్లి ఆశను కౌగిలించుకుంటుంది. ఇంతలో కొంచెం దూరం నుండి మానసరావు మాట వినిపిస్తుంది)

మానస : (పెద్దగా)వసుమతీ! వసుమతీ! ఎక్కడ? ఎక్కడున్నారు? నాకేం కనిపించడం లేదు.

వసు : (పెద్దగా) అదుగో, ఆయనే! ఇక్కడ ఇక్కడే ఉన్నాం. ఆ పెద్దరాయి లేదూ! దానివైపే. రాయి ప్రక్కగా కుడి వైపునే రాండి.

(మానసరావు ప్రవేశిస్తాడు. వయస్సు 30. శరీరం మొరటు తేలి ఉంటుంది. బాగా ఎదిగిన గడ్డం. చిరిగిపోయి గుండీలు లేకుండా వున్న కోటు. అతుకులు వేసి కుట్టిన కాకీ పాంటు. వళ్ళంతా చెమటలుపోసి ఉంటుంది మనిషి రొప్పుతుంటాడు. చేతిలో సగం పగిలిన కుండ పట్టుకొని ఉంటాడు. వసుమతికి దగ్గరగా వస్తాడు.)

మానస : వసుమతీ ! ఇవ్వాళ మళ్లీ నిన్ను చూస్తాననుకో లేదు. అబ్బ ! ఎంత బాధ పడ్డానని.

వసు : (కోపంగా) ఏం ? మీరేనా బాధపడ్డది, మా సంగతి మీకు జ్ఞాపకం ఉందా ? మేం ఇక్కడ యమయాతన అనుభవిస్తూ ఉంటే మీరెక్కడో...

మానస : వసుమతీ! ఉండు. నా మాట పూర్తిగా విను! నేను...

వసు : అవును. మీ ఇష్టం వచ్చినట్లు తిరిగొచ్చారు. రెండు రోజులుగా పిడికెడు మెతుకులు లేవు. చివరకు త్రాగడానికి చుక్క నీళ్ళుకూడా......

మానస : వసుమతీ ! నన్ను చెప్పనీయి. నేను పడ్డ బాధలు వింటే నీ విట్లా మాట్లాడవు. నేను మీకోసం ఎన్ని శ్రమలు పడుతున్నానో....

వసు : (అతని మాటలు వినిపించుకోకుండా) నే నేమైనా ఫరవాలేదు. పసిబిడ్డ. ఆకలికి నకనకలాడిపోతూంది. నాలుక పిడచ కట్టుకపోయి కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఉంది. ఇదంతా మీ రాలోచించారా ?

మానస : (కోప తో ఆజ్ఞాపిస్తూ) వసుమతీ ! ఏమిటి నీవు మాట్లా డేది ! (వసుమతి కొంచెం నిదానించి వింటుంది) నన్ను చెప్ప నిస్తావా ? లేదా ? (ఆవేశంతో) రాళ్ళల్లో, రప్పల్లో, గుట్టల్లో, ఎన్నో మైళ్ళు నడిచాను. ఎక్కడా చుక్క నీరు లేదు. ఒక్క కాయకూడా దొరక లేదు. కనీసం పక్షి అయినా కనిపిస్తుందనుకున్నా. ఊహూ. నడిచినంతదూరం జంతువులు గుట్టలు గుట్టలుగా చచ్చి పడున్నాయి. భరించ లేని దుర్గంధం. భయంకరంగా నక్కల అరుపులు. నర సంచారం లేదు. ఏదైనా కడుపు నింపుకోడానికి దొరకు తుందేమో అనె ఆశతో తిరిగాను. అన్ని మూలలూ వెతి కాను. కాని గుప్పెడు ఆహారం మీకోసం తేలేకపోయాను. (వచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ) ఇదిగో ! నా కాళ్ళు చూడు. రక్తం కారుతున్నాయి. వళ్ళంతా పచ్చిపుండులా ఉంది. (కాళ్లు చూపుతాడు; కాళ్ళు గీరుకుపోయి అక్కడక్కడ రక్తం స్రవిస్తూ ఉంటాయి)

ఆశ : నాకోసం ఏం తీసుకురాలేదు నాన్నా ! నీళ్ళు కూడా తేలేదా ?

మానస : (చేతిలోనికుండ క్రింద పెడతాడు. ఆశను దగ్గరికి తీసుకుంటాడు) అవునమ్మా ! నేను నీకు నాన్నను కాదు. హృదయం లేనివాణ్ణి.

వసు : (ఆవేశంతో) అవును. మీ చేతుల్లో నేనెప్పుడు సుఖ పడ్డాను. కాకి పుట్టినప్పుడూ నలుపే, పెరిగినప్పుడూ నలుపే అన్నట్లు నా బ్రతుకు మొదటినుంచి చివరిదాకా కష్టాలే. మొదట్లో నిరుద్యోగం, దారిద్ర్యం; అందులోనే బిడ్డపుట్టటం, పెంచే దిక్కూ మొక్కూ లేకపోవటం, ఆ తర్వాత మీరు యుద్ధంలోకి వెళ్ళితే ఇంటిదగ్గర ఒంటరిగా అష్టకష్టాలు పడ్డాను. ఇంటింటా ఊడిగం చేశాను. బిచ్చమెత్తాను. మీరు యుద్ధంనించి తిరిగివచ్చారు. మళ్ళీ యధాప్రకారం నిరుద్యోగం, ఆకలి, పస్తులు, బాకీలు, అనుక్షణం చావు నోట్లో పడుతూ బ్రతికాను. ఇక ఎన్నడు మీవల్ల సుఖ పడింది? ఎంతచెడ్డా నేనూ మనిషినే. ఎంతకాలం ఓర్చుకో గలను.

మానస : (బాధగా) వసుమతీ! ఆపు! నీవింకా మాట్లాడితే నా గుండెలు ఆగిపోతయి. నన్ను ఊపిరి పీల్చుకోనీయి. అవన్నీ తవ్వుకుంటే ఏం లాభం? Pause. అవును. నిన్ను నానా యాతనలు పెట్టాను. నరకంలో దింపాను. కాని నేను నిన్ను ప్రార్థించేది ఒక్కటే. ఇవన్నీ నీకోసమే చేశాను. నీ సుఖంకోసమే చేశాను. చివర నెత్తురుబొట్టుకూడా పిండి పనిచేశాను. కాని ఎక్కడికి వెళ్ళినా, ఏపని చేసినా, మృత్యువు ఎదురైంది. (దుఃఖంతో) ఇప్పటికైనా నీకోసమే బ్రతికున్నాను. ఇదిమాత్రం జ్ఞాపకం ఉంచుకో. నీవుకూడా నన్ను దూరంచేస్తే నే నేమైపోతాను ? ఈ లోకంలో నా కెవరున్నారని. (మాట్లాడలేక ఆగిపోతాడు. వసుమతి ముఖంలో మార్పు కనపడుతుంది. భర్తను తాను అనవసరంగా నిందించానని బాధ పడుతుంది )

ఆశ : (బిక్కముఖం వేసి) నాన్నా! నీళ్ళు. దప్పిక నాన్నా!

మానస : (దగ్గఖాన్ని తమాయించుకుని) ఇదిగో అమ్మా! బురదగా ఉన్నాయి. అట్లాగే కొద్దిగా నాలిక తడుపుకో (కుండ తీసుకుని 'ఆశ' నోటిదగ్గర ఉంచుతాడు. 'ఆశ' కొద్దిగా నీళ్ళ రుచి చూస్తుంది).

వసు : ఆశా! నాకో చుక్క ఉంచమ్మా! నాలిక పిడచకట్టుకపోయింది.

ఆశ : (నీళ్ళు త్రాగకుండా అయిష్టత చూపుతుంటుంది).

మానస: ఏంతల్లీ! త్రాగవేం? నీవు త్రాగింతర్వాత అమ్మకిస్తాను.

ఆశ : ఏం బాగులేవు నాన్నా! అబ్బా! డోకొస్తూ వుంది.

మానస : పోనీ అమ్మకిస్తానుండు. వసుమతీ! నీవు తీసుకో.

(వసుమతి కుండను తీసికొని నోటిదగ్గర పెట్టుకుంటుంది. ఏదో అసహ్యం కలిగినట్లుగా బాధపడుతుంది.)

వసు : అబ్బ! ఆశ చెప్పినమాట నిజమే. ఈ నీళ్ళు ఏదో విధంగా ఉన్నాయి. రుచి లేదు. త్రాగ బుద్ధివెయ్యడంలేదు.

మానస : ఎంతసేపటినుంచో దాహం అవుతూ ఉందికదూ! అందుకని అలా ఉందేమో?

వసు ; (తిరిగి కుండను నోటిదగ్గర పెట్టుకుంటుంది. గుండె పగిలినట్లుగా) కాదు ఇవినీళ్ళుకాదు. రక్తం! రక్తం! రక్తం! కెవ్వున కేకవేస్తూ కుండను క్రింద పడేస్తుంది. మానసరావు గాభరాగా పడిపోబోతున్న వసుమతిని పట్టుకుంటాడు. 'ఆశ' ఒక్కసారిగా 'నాన్నా' అంటూ తండ్రిని కౌగలించుకుంటుంది. మానసరావు, క్రింద పడ్డ రక్తాన్ని చేత్తో తడుపుకొని ఏదో పరీక్షగా కనువెల్తురులో చూస్తాడు.)

మానస : (నిర్ఘాంతపోయి) రక్తం! రక్తం! అవును ఇది రక్తమే వసుమతీ! వసుమతీ! (వసుమతి తిన్నగా లేచి కూర్చుంటుంది)

చూడు ఇది రక్తమే వసుమతీ! నేనే పొరపాటు పడ్డాను. ఆ చీకట్లో వస్తుంటే దారిలో కాలికి తడి తగిలింది. ప్రక్కనే ఏదో చిన్న మడుగులా వుంది నీళ్ళని భ్రమపడ్డాను. అక్కడే వున్న ఒక కుండ పెంకుతో తీసుకున్నాను. బురదగా వుంది. ఏదో నాలుక తడుపుకుంటారని నేనుకూడా త్రాగకుండా తెచ్చాను వసుమతీ! ఇలా అవుతుందని అనుకోలేదు. ఎంతపని చేశాను వసుమతీ! చివరకు ..ఛీ! ...నీ చేత రక్తం త్రాగించాను కదూ? నన్నేంచేస్తావ్? రక్తం! రక్తం! (పెద్దగా కేకవేస్తూ క్రింద పడిపోతాడు. ఒక్కక్షణం నిశ్శబ్దం. ఆశమాత్రం వెక్కి వెక్కి ఏడుస్తూ ఉంటుంది. వసుమతి మెల్లగా మానసరావును కూర్చోపెడుతుంది. అతను కళ్ళుతెరుస్తాడు.)

వసు: చూడండి! మీరు ఆవేశ పడకండి. దీనికంతటికీ కారణం నేనే. మిమ్మల్ని చాలా మాటలన్నాను. అనవసరంగా నిందించాను. అవేవీ మనసులో వుంచుకోకండి. ఆకలితోనే ఈ రాత్రిగూడ గడుపుదాం. (ఆశను చూస్తూ) రా! తల్లీ రా! (ఆశ దగ్గరిగా వస్తుంది)

(ఇంతలో కొంచెం దాపులో కుక్క మొరుగుతున్నట్లు వినపడుతుంది. ఎవరో వస్తున్నట్లు అలికి డవుతుంది. ఏదో గుడ్డిగా వెలుతురుకూడా కనిపిస్తుంది)

ఆశ: (భయంతో) ఏమిటో అరుస్తున్నయి. నాకు భయంగా ఉందమ్మా!

వసు: ఏం లేదు తల్లీ! నేనున్నానుగా! (భర్తతో) ఏదో చప్పుడవుతూ ఉంది. కొంచెం లేచి చూడండి.

మానస: (మనస్సు బాగా దెబ్బతిని ఉన్నాడు. మనిషి మాటల్లో, చేతల్లోకూడా మార్పు ఉంది.) (వెగటుగా నవ్వి) ఎవరొస్తారు

వసుమతీ! ఇప్పుడు మనం ఎక్కడున్నామో తెలుసునా? శ్మశానంలో. మహా శ్మశానంలో. భయం ఎందుకు? శ్మశానం కంటె భయంకరమైంది ఏముంటుంది?

(అతడు: (స్వార్థపరుడు) ప్రవేశిస్తాడు. మనిషి బాగా ఒడ్డూ, పొడుగూ. ముఖంలో అతి క్రూరత్వం కనపడుతూ ఉంటుంది. అతన్ని చూచి వయస్సెంతో చెప్పలేం. మాసిన ఫాంటు. మాసిన కోటు. నడుంకలో నీళ్ళు పోసుకునే tumbler లాంటిది తగిలించుకొని ఉంటాడు. ఒక చేతిలో కర్ర ఉంటుంది. మరో చేతిలో చిన్న లాంతరు ఉంటుంది. ఒక్క క్షణం వరకూ పరకాయించి చూస్తూ నిలుచుంటాడు.)

ఆశ: అబ్బ! చలి! చలి అమ్మా!

వసు: నా వళ్ళోకి రా! బాగా! ఊఁ! అలా ఒదుక్కొని కూర్చో. (ఆశతో)

మానస: చలి! కలి! ఆకలి! (నవ్వుతాడు)

అతడు: (నవ్వుతాడు)

మానస: (చివాలున లేస్తాడు. అతన్ని సమీపిస్తాడు. గట్టిగా పట్టుకుంటాడు.) ఎవరు నీవు? మనిషివా? దెయ్యానివా?

అతడు: దెయ్యాలమధ్య వున్న మనిషిని.

మానస: అయితే ఎందుకు నవ్వావ్? (ఆశ పడుకొని వుంటుంది. వసుమతి మానసరం-పుకు దగ్గరగా వచ్చి నిలుచుంటుంది.)

అతడు: నీ వన్న మాటలకి!

వసు: ఆయన ఏమన్నాడు?

అతడు: చలి! కలి! ఆకలి! (నవ్వుతాడు)

మానస: ఏం? నీ కాకలిగా లేదూ?

అతడు : ఇదుగో రొట్టె. (వసుమతి, మానసరావు రొట్టె వైపు ఆబుర్దాగా చూస్తారు)

మానస : ఎక్కడిదీ ? ఎక్కడనించి వచ్చిందీ రొట్టె?

అతడు : (మాట్లాడడు. రొట్టె తింటూ నిలుచుంటాడు. మానసరావు అది చూచి సహించలేక పోతాడు.)

మానస : (గద్దిస్తూ) చెప్పవేం?

అతడు : (నవ్వుతూ) ఇది దూర దేశంనుంచి విమానంలో తెప్పించాను. మాంసాన్ని వెన్నతో వండి తయారు చేసిన రొట్టె ఇది. చాల ఖరీదైంది. (చంకలోని tumbler ను చూపిస్తూ) ఇవి నీళ్ళనుకున్నారేమో! కాదు. ద్రాక్ష రసం. ఇది ఒక్క గ్లాసు త్రాగితే ఎంత అలసటైనా తీరుతుంది.

వసు : (కొంచెం ఓర్పుతో) ఏవండీ! మీ రెవరైతే మాకేం. మేం నాలుగు రోజుల్నుంచీ అన్నంతినలేదు. రెండు రోజుల్నుంచీ గంజి కూడా తాగలేదు. ఈ రోజంతా నీళ్ళు లేకుండా వున్నాం. మేమేకాకుండా పసిబిడ్డ. (ఆశ నుచూపుతూ) కళ్ళల్లో ప్రాణాలు పెట్టుకుని ఉంది. మా కాస్త ఆహారం, నీళ్ళు చూపించి పుణ్యం కట్టుకోండి.

అతడు : నే నొక్కమాట చెపుతా వింటారూ ?

మానస, వసు : (ఏమిటన్నట్లు చూస్తారు)

అతడు : ఈ ప్రాంతంలో వందలకొద్దీ జనం చచ్చారు. పశువులు పోయినయి. కొన్ని వేలమంది వెళ్ళిపోయారు. కారణం తెలుసా? కరువు, అంటువ్యాధులు, ఆకలి ఇవన్నీ. ఇవి రాకముందు ఇక్కడే బాంబులుకూడా పడ్డయి. ఈ చచ్చిన వాళ్ళందరికీ ఎవరైనా ఆహారం చూపించారా!మీకూఅంతే.

మానస : ఛీ ! నీవు మనిషివేనా ?

వసు : రాక్షసుడు.

అతడు : కనుకనే బ్రతికున్నా. మనిషినైతే మీలాగే చచ్చేవాణ్ణి. (రొట్టెతింటాడు)

వసు : ఎదురుగా ప్రాణాలు పోతుంటే చూస్తూ తిండి తింటున్నావా ? ఎంత రాతి గుండె నీది. నీ వెంతమంది ప్రాణాలు తీశావో ?

అతడు : వుండు చెప్తా ! కాస్త త్రాగనీ! (కూర్చుని చంకలో ఉన్న Tumbler బిరడాతీసి త్రాగుతూ ఉంటాడు. ఇంతలో ఆశ లేస్తుంది. పరుగుతో అతని దగ్గరకి వస్తుంది.)

ఆశ : (అతన్ని పట్టుకొని) నాకు. నాక్కాసిని నీళ్ళియ్యి.

అతడు ; (త్రాగుతూనే ఉంటాడు. ఆశ అతనిచేతిలోని Tumbler ను గట్టిగా పట్టుకుంటుంది. అతడు ఆశను బలంగా త్రోస్తాడు. ఆశ 'అమ్మా' అని అరిచి క్రిందపడుతుంది. మానసరావు అతన్ని మ్రింగేంత ఆవేశంతో చూస్తుంటాడు)

వసు : (ఆశను లేవనెత్తి దగ్గరకు తీసుకుంటూ) ప్రాణఘాతకుడా ! నీ కెంత స్వార్థం ! పసిబిడ్డ నీళ్ళడిగితే త్రోసేస్తావా ? నీకు చేతు లెట్లా వచ్చినయ్ !

(మానసరావు విసురుగా వెళ్ళి అతని చేతిలోని Tumbler ను, రొట్టెను లాక్కోపోతాడు. కాని వసుమతి అడ్డంవస్తుంది.)

వసు : వాడిజోలికి పోకండి; వాడు కసాయివాడు.

ఆశ : నాన్నా ! ఇక్కడ పురుగుకూడా ప్రాణంతో లేదన్నావే? ఇత నెట్లా బ్రతికున్నాడు ?

మానస : ఎంతో మందిని చంపి...

అతడు : నిజం చెప్పావ్.

వసు : ఇదిగో ! (పగిలి పడివున్న కుండను చూపెడుతూ) రక్తం ! దీన్నే మేం త్రాగటానికి ప్రయత్నించాం. నీకు జాలి లేదూ?

అతడు : (నవ్వుతాడు) ఈ మాత్రానికేనా? నే నెంతమంది రక్తం త్రాగానో తెలుసా? (మానసరావు నుద్దేశించి) మిస్టర్ ! నా మీదెందుకంత కోపం ? ఆవేశపడితే ఏం లాభం లేదు. ఒక్క సూత్రం చెప్తా గుర్తుంచుకో ! నీవు బ్రతకాలంటే నీ చుట్టు ప్రక్కల కొంతమంది చావాలి. నీవు సుఖపడాలంటే కొంతమందిని కష్టపెట్టాలి. నీవు కడుపునిండా తినాలంటే కొంతమంది కడుపులు కొట్టాలి. నీవు లాభం పొందాలంటే కొందరు నష్టపడాలి. ఇదే సృష్టిలోని రహస్యం. ఇదే బ్రతుకులోని పరమార్థం...

మానస : ఆపు, నీ ఉపన్యాసం.

అతడు : (నవ్వుతాడు) మనిషిని నమ్మితే చెడిపోతావ్. మనిషి మాటలు నమ్మితే చెడకుండా ఉంటావ్...అర్థమైందా (నవ్వుతాడు)

మానస : ఇంతకూ ఏమిటి నీ వనేది ?

అతడు ; ఈ ప్రక్కనే నా ఇల్లుఉంది...ఇప్పుడది ఇల్లుకాదులే... నాతో రా చూపిస్తా. అక్కడ నుయ్యి ఉంది. చల్లని నీళ్లు కావల్సినన్ని తాగొచ్చు. తింటానికికూడా పెడతా.

ఆశ ; (సంతోషంతో) వెళ్ళు నాన్నా ! మరిన్ని నీళ్లూ, అన్నం తీసుకురా ?

వసు : ఇతన్ని నమ్మేదెవరు ?

అతడు : (అసహ్యంగా నవ్వుతాడు)

మానస : వసుమతీ! నీ విక్కడే ఉండు. నే నిప్పుడేవస్తా.

వసు : ఏమో? నాకు భయంగా వుంది.

మానస : అదేమిటో చూద్దాం! నే నొక్క క్షణంలో వచ్చేస్తాగా!

వసు : 'ఆశ'నైనా తీసికెళ్ళండి.

మానస : వద్దు. ఈ చీకట్లో, ఈ శ్మశానంలో నడవలేదు.

(అతడు చిన్నగా నవ్వుతాడు. ముందు అతడు వెళ్తుంటే వెంట మానసరావు వెళతాడు.)

ఆశ : త్వరగా రా నాన్నా!

(తిరిగి స్టేజీ చీకటిగా అయిపోతుంది. Spot Lights వెల్తురులో వసుమతి, ఆశ, కూర్చుని ఉంటారు. కొద్ది క్షణాలు అలాగే నిశ్శబ్దంగా ఉంటుంది. లోపలినుంచి తలుపులు తీసిన చప్పుడు వినపడుతుంది. అటు పిమ్మట ఇద్దరు పెనగులాడుతున్నట్లుగా ధ్వనులు వస్తాయి. వసుమతి భయంగా మానసరావు వెళ్ళిన దిక్కుచూస్తూ వుంటుంది. తిరిగీ తలుపులు బలంగా వేసిన చప్పుడు వినపడుతుంది. మనిషి పరుగెత్తుకుని స్టేజీవైపు వస్తున్నట్లుగా తెలుస్తుంది. ఆ తర్వాత అతడు ప్రవేశిస్తాడు. ఒకచేతిలో లాంతరు మరో చేతిలో నీళ్ళకూజా వుంటుంది.)

అతడు : ఇదిగో మీకోసం నీళ్ళు తెచ్చా. తాగండి. ఊc!
(అందివ్వబోతాడు.)

వసు : నీవొక్కడివే వచ్చావేం? ఆయనేడీ?

అతడు : వస్తున్నాడు, వెనకాలే వస్తున్నాడు. ఊc! త్వరగా! ముందు నీ బిడ్డకీయి.

మానస : (లోపల్నుంచి) వసుమతీ! వసుమతీ! వద్దు. నీళ్ళు

త్రాగబోకు. వాడు కిరాతుడు. రాక్షసుడు.

(వసుమతి గాభరాపడుతుంది)

అతడు : ఏంయ్! ముందు నీళ్ళు త్రాగు. వాడికి పిచ్చి పుట్టిందిలే. వాడి మాటలు విని ప్రాణాలెందుకు తీసుకుంటావ్.

మానస : (లోపల్నుంచి) వద్దు. త్రాగబోకు. నామాటలు నమ్ము. వీడు మనిషి కాదు. ఆ నీళ్లలో విషం వుంది. మనల్ని చంపటానికి వీడీ పన్నాగం పన్నాడు. వసుమతీ! ఆశ! జాగ్రత్త. నీళ్ళిచ్చేవు?

వసు : (అతన్ని బలంగా తోస్తుంది. అతను కూజాతో క్రింద పడబోతాడు. కాని తమాయించుకుంటాడు) ఛీ! దుర్మార్గుడా! నా భర్తను ఏంచేశావ్. చెప్పు? నా మానసరావును ఏంచేశావ్?

(ఆశను ఎత్తుకొని పరుగెత్తబోతుంది. అతను బలంగా ఆపుతాడు.)

అతడు : ఇదిగో నీబిడ్డ కిస్తున్నా. త్రాగకపోయినావా పీక నులిమేస్తా. (ఆశ నోట్లో బలవంతాన నీళ్ళు పోయటానికి ప్రయత్నిస్తాడు. వసుమతి అడ్డగిస్తుంటుంది. ఇద్దరూ పెనుగులాడు తుంటారు. ఇంతలో లోపల్నుంచి తలుపులు గడియలుమని క్రిందపడ్డట్లుగా చప్పుడవుతుంది. కుక్క పెద్దగా మొరిగినట్లు వినిపిస్తుంది. మానసరావు రొప్పుతూ వస్తాడు. వళ్ళంతా రక్తం కారుతూ ఉంటుంది. కాలికి బలంగా గాయం పడి రక్తంస్రవిస్తూ ఉంటుంది. మానసరావు 'అతని' చేతులలో కూజాను లాక్కొని నేలకు విసిరి కొడుతాడు. అతని పీకను గట్టిగా పట్టుకుంటాడు. 'అతడు' జేబులోంచి ఏదో తీయటానికి ప్రయత్నించి పెనుగులాడుతాడు. ఇలా ఇద్దరిమధ్య ఒక్కక్షణం జరుగుతుంది. లోపలినుంచి పెద్ద వెలుతురు. మంటలు పొగలు కనిపిస్తాయి.)

మానస : ('అతని' పీక నులుముతూ) అదిగో! నీయిల్లు. నీ

శ్మశానం! తగలబడుతూ వుంది! నీ డబ్బు, నీ నోట్ల కట్టలు, నీ డాలర్లు, నీ బంగారం, నీ మందుగుండు సామాగ్రి అంతా పెట్రోలుపోసి తగలబెట్టాను. ఆశ్మశానంలో దగ్ధమౌతూ వుంది. పో! ఇక పో !

(విసురుగా ఒక్క తన్ను తన్నాడు. 'అతడు' తెర అవతలికి పడిపోయి 'నా డబ్బు! నా డాలర్లు! అంటూ వెర్రికేక వేసి కూలిపోతాడు. మానసరావు తూలి పడి పోతుంటే 'వసుమతి' పట్టుకుని కూర్చోబెడుతుంది. 'ఆశ' బిక్కముఖ వేసుకుని చూస్తుంటుంది.

వసు : ఏమిటి ఇలా అయిపోయ్యారు ? ఏం జరిగిందీ ? వళ్లంతా రక్తం. ఏమిటిదంతా ? చెప్పరేం ?

మానస . వసుమతీ ! నన్ను నీ తొడమీద పడుకోనీయి. కళ్లు తిరుగుతున్నాయి. (వసుమతి తొడమీద తలవుంచి పడుకుంటాడు).

మానస : (ఆశను దగ్గరికి తీసుకుంటాడు) వసుమతీ! వసుమతీ! వాడు మనిషి కాదు. కిరాతుడు. పచ్చి రక్తం త్రాగేవాడు. వాడి ఇల్లు...ఇల్లు కాదది శ్మశానం. శవాలు, మొండాలు, ఎముకల గుట్టలు, అబ్బ ! భరించలేని దుర్గంధం. వాడి దగ్గర నోట్ల కట్టలు, డబ్బు ! డాలర్లు ! బంగారం, రత్నాలు మందుగుండు సామాను, ఇంకా ఎన్నో...జనాన్ని చంపి రక్తం పిండి, పీడించి సంపాయించాడు అదంతా. వీడిలాంటి వాళ్ళు రాక్షసులు, నరహంతకులు దేశంలో ఎంతోమంది వున్నారు. వాళ్ళ మూలంగానే యుద్ధాలు, కరువులు, కాటకాలు, దారిద్ర్యం, ఆకలి చావులు, ఇవన్నీ. మనలాంటి వాళ్ళు ఎంతోమంది చచ్చారు. ఎన్నో కుటుంబాలు నాశనమయినాయి. ఎన్నో సంసారాలు కాలిపోయినాయి. వీళ్లను నమ్మగూడదు వసుమతీ ! ఎందుకు వాడికాడబ్బు!

నోట్లు కట్టలు కట్టలు దాచిపెట్టాడే! అదంతా ఇప్పుడే మయింది. తగలపెట్టా. పెట్రోలుపోసి తగలపెట్టా. ఆ డబ్బంతా మనకంటే ఎంతో హాయిగా బ్రతికేవాళ్ళమే. ఇలా పాతికేండ్లకే ఎందుకు చచ్చిపోతాం. అబ్బ. నా కళ్ళు పచ్చగా వున్నాయి వసుమతీ! ఈ లోకం అంతా నాకు పచ్చగా కనపడుతూన్నుంది. వసుమతీ! ఏం చెప్పను? అక్కడ నుయ్యి వుంది. దానినిండా విషం. బాంబుల్లోని విషం. ఆ నీళ్ళు త్రాగాను వసుమతీ!

వసు: ఆఁ! ఎంతపని జరిగింది? (గుండె పగిలేంత దుఃఖంతో) అయ్యో! ఇన్ని కష్టాలొచ్చినా మీరున్నారుకదా అని సంతోషించానే. మీకోసమే బ్రతికున్నానే. మీరు పోయింతర్వాత నాకీలోకంలో ఎవరున్నారు? ఇప్పుడేమిటి చేయటం.

మానస: అబ్బ! బాధగావుంది. వసుమతీ! ఒకసారి ఇలా చూడు. నవ్వు. ఆశా! నా చిట్టీ! ఇలా గుండెమీద పడుకో. ఇప్పుడెంత హాయిగావుంది. వసుమతీ! ఒక్కమాట చెప్తుతాను. నీవు తక్షణం 'ఆశ'తో వెళ్ళిపో. వెళ్ళగలిగినంత దూరం వెళ్ళిపో. నీకోసం 'ఆశ'ను వదలి నేను ఆకలితో చచ్చిపోతున్నా. నీవు 'ఆశ'తో బ్రతుకు. 'ఆశ'ను వదిలిపెట్టకు. జాగ్రత్త! ఆశను ప్రాణంగా చూచుకో. 'ఆశ'తో జీవించు.

(ప్రాణం విడుస్తాడు. వసుమతి వెర్రికేక వేస్తుంది. 'ఆశ' జావురుమని ఏడుస్తుంది.)

(తెర)

★